# ఇప్పుడు మీరు అతని పళ్లను పిప్పిపళ్లు కాకుండా చెయ్యవచ్చును.

# వాడండి సిగ్నల్ 2

## పళ్లను గట్టిపరచి దంత క్షయాన్ని నివారించేందుకు దీనిలో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది.

పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు. దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే దంతక్షయం మరింతగా జరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి




*నోటిలో ఊరే ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్‌పేస్టులు ఆపలేవు.*




*సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది. ఇది నోటిలోని ఆమ్లాలు పళ్లలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది.*




**పిప్పి పళ్లను నిరోధించే టూత్‌పేస్ట్.**

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2— దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్‌పేస్ట్. దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్లతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్లకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తి నిస్తుంది—పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది. దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్‌పేస్ట్ లేదు. నేను చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు, మీ దంత వైద్యుని కూడా అడగండి.

**సిగ్నల్ 2 ఫ్లోరైడ్‌తో**

కుటుంబంలో వారికి పిప్పి పళ్లు రాకుండా నిరోధిస్తుంది.



హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SG2-1-223 TL

కత్తిరించి ఉంచండి

# బోర్న్‌విటా

# ఆశ్చర్యకరమైన పరిశోధన పుట-1

## టెలిఫోను యొక్క అద్భుతం

కనిపెట్టినవారు : అలెగ్జాండర్ గ్రహామ్‌బెల్
1847–1922
యునైటెడ్ స్టేట్

సూత్రము : విద్యుత్తు ప్రవాహం మార్పుల ద్వారా శబ్ద ప్రసరణ

సంవత్సరం : 1876



### టెలిఫోను ఎలా పనిచేస్తుంది?

టెలిఫోను రెండు ముఖ్య భాగాలు కలిగి యున్నది. ట్రాన్స్‌మీటరు (మౌత్‌పీస్) మరియు ఒక రిసీవరు (ఇయర్‌పీస్) ట్రాన్స్‌మీటర్‌లో డయాఫ్రామ్ అనబడు ఒక పలుచని లోహపు చక్రము కార్బన్ గ్రాన్యుయల్స్ దాని వెనుక ఉంటాయి. ఈ గ్రాన్యుయల్స్ ఎలక్ట్రికల్ సర్క్యూట్‌లో ఒక భాగము :

ఒక వ్యక్తి టెలిఫోనులో మాట్లాడుతున్నప్పుడు, శబ్దంలో మార్పు డయాఫ్రామ్‌ను స్పందింపచేస్తుంది. కార్బన్ గ్రాన్యూల్స్ విద్యుత్తు ప్రవాహపు మార్పులు సర్క్యూట్‌లో కల్గిస్తాయి. అవి పెద్దగా చేయబడి ప్రసరింపబడతాయి.



రిసీవరులో సున్నితమైన తీగ చుట్టలో గల చిన్న పర్మనెంట్ మేగ్నెట్ ఉన్నది. ఇవి ఒక చాలా పలుచని వర్తులాకారమైన లోహపు డయాఫ్రామ్‌కు చాలా దగ్గరగా అమర్చబడ్డాయి. ఈ తీగ చుట్టుల ద్వారా మార్పులతో విద్యుత్ప్రవాహ ప్రసరణ అయినప్పుడు, మార్పులు గల మేగ్నటిక్ ఫీల్డ్ ఏర్పడుతుంది. డయాఫ్రామ్ లోహపుది అగుటచే ఈ మేగ్నటిక్ ఫీల్డ్‌చే ఆకర్షింపబడి, మేగ్నటిక్ ఫీల్డ్ శక్తిని బట్టి సంచలనం పొందుతుంది.



ఈ డయాఫ్రామ్ సంచలనాలు ప్రసరణమైనలాంటి శబ్ద తరంగాలను పునరుత్పత్తి చేస్తాయి. వీటిని శ్రోతలు వింటారు.

## క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా

మీకు అగ్రస్థానం చేకూర్చి అధిక శక్తినిస్తుంది.






కత్తిరించి ఉంచండి

కత్తిరించి ఉంచండి

OBM 8976 TL

### ప్రత్యేక సదుపాయం

ఒక ప్రముఖ డిస్ట్రిబ్యూటర్‌తో మేము ప్రత్యేకమైన ఏర్పాటుచేసి, ఆకర్షణీయమైన 50 పేజీల రంగుల సచిత్ర పుస్తకం ''The How and Why Wonder Book of Communications'' (ఇంగ్లీషులో) యు.కె.లో ప్రింటు చేసినది. సరసమైన ధరలో రు. 6.50కే (మూల్య ధర: 50 పెన్స్) లభిస్తుంది. పోస్టు ఛార్జీ లేకుండా. మీ పుస్తకం కొరకు రు. 6.50 మనియార్డర్ ద్వారా పంపండి. మరి ఒక బ్రౌన్‌విటా ప్యాక్‌పై పలుచని కాయితం గాని లేదా పై అట్టగాని ఏదైనా విడిగా పోస్టులో పంపండి: Department: 5, India Book House, 22 Bhulabhai Desai Road, Bombay 400 026. త్వరపడండి, పుస్తకాలు పరిమితం.



# 'చిత్రా' అస్తమయం

జననం: 12 మార్చి 1912
మరణం: 6 మే 1978

చందమామ ప్రారంభించినది లగాయతు చందమామ ప్రధాన చిత్రకారుడుగా ఉండి, భారతదేశమంతటా అనేక లక్షల మందికి అభిమానపాత్రుడైన 'చిత్రా' మరణవార్త తెలపటానికి విచారిస్తున్నాము.

'చిత్రా' అసలు పేరు టి. వి. రాఘవులు. ఆయన మద్రాసు ఆంధ్రుడు, చూలైలో జన్మించాడు. ఎస్. ఎస్. ఎల్. సి. వరకు చదివాడు. 1942లో మద్రాసు యుద్ధభయంతో ఖాళీ అవుతున్న రోజులలో ఆయనకు వివాహం జరిగింది. అప్పుడాయన ఏ. ఆర్. పి. వార్డెన్‌గా ఉండేవాడు. 1947 జూన్ 2న చందమామలో చేరకముందు క్లైన్ అండ్ పెరెల్‌లో బ్లాక్ మేకర్–ఫొటోగ్రాఫర్‌గానూ, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్‌లో సేల్స్‌మన్‌గానూ, చిత్రకారుడుగానూ పని చేశాడు.

'చిత్రా' చిత్రలేఖనంలో శిక్షణ పొందిన కళాకారుడు కాదు. స్వయం కృషితో చిత్రకారుడైనవాడు. ఆయనకు ఫోటోగ్రఫీలో మంచి ప్రవేశం ఉన్నది. ఆయన ఫోటోగ్రాఫులకు విదేశాలలో బహుమతులు లభించాయి. చందమామలో వస్తున్న చిత్రాల శిల్పం సృష్టించినవాడు చిత్రా. ఆయన చిత్రాలు చందమామలో సుమారు పదివేలు వెలువడ్డాయి.

'చిత్రా' అస్తమయం చందమామకు తీరని లోటని మా పాఠకులందరూ ఊహించగలరు. చక్రపాణి నిర్యాణం అనంతరం చందమామకు చిత్రా పోవటం రెండవ బలమైన దెబ్బ. ఇన్ని ఏళ్ళమీదట చందమామ చిత్రకారులను చూడవచ్చినవారు అనేకవేలమంది ఉంటారు. చిత్రాకు ఏకలవ్యశిష్యులు ఎందరున్నారో ఎవరూ ఊహించలేరు. ఆయన చిత్రాల అనుకరణలు అనేక "పిల్లల" పత్రికలలో కనిపిస్తూనే ఉన్నాయి. భారతదేశంలోని పిల్లలందరి ముఖాలూ వికసించగలందులకు చిత్రా వెలిగించిన జ్యోతి ఎన్నటికీ ఆరదు.

'చిత్రా' ఆత్మకు శాంతి కలగాలని కోరుకుంటున్నాము.

వ్యవస్థాపకులు

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పిశాచాల బాకీ'']కి ఆధారం మాచిరాజు కామేశ్వరరావు రచన. మనుషులు ఎక్కువగా పాపపుణ్యాలకు సంబంధించిన నమ్మకాలపై ప్రేరణ పొందుతారు. పాపాలు చేసినవాళ్లు వాటి ఫలితాల నుంచి తప్పించుకునేటందుకు తీర్థయాత్రలూ, దానాలూ, పూజలూ చేస్తారు. అలాగే కొన్ని పనులు చేస్తే పాపం చుట్టుకుని, శిక్ష పొందవలసి వస్తుందని భయపడి కొందరు తమ స్వార్థాన్ని కూడా విడిచిపుచ్చుతారు. ''పిశాచాల బాకీ'' అన్న కథలో ఒకరి ఋణాన పోయినవారు పిశాచాలవుతారని కళ్లారా చూసి పర్వతుడు బుద్ధిగా నడుచుకుంటాడు.

సంపుటి 62 జూన్ '78 సంచిక 6

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00









అస్వాధీనం కథం దైవం
ప్రకారై రభిరాధ్యతే,
స్వాధీనం సమతిక్రమ్య
మాతరం పితరం గురుమ్. 1

[ప్రత్యక్షంగా ఉన్న తల్లి దండ్రులనూ, గురువులనూ విడిచి, కనిపించని దైవాలను ఎలా ఆరాధించటం?]

స్వర్గో ధనం వా, ధాన్యం వా,
విద్యాః పుత్రా స్సుఖాని చ,
గురు వృత్త్యను రోధేన
న కించి దపి దుర్లభం. 2

[స్వర్గంగాని, ధనంగాని, ధాన్యంగాని, విద్యగాని గురువులను ఆరాధించటం వల్ల అన్నీ లభిస్తాయి; దానితో సాధ్యం కాని దేదీలేదు.]

దేవ గంధర్వగోలోకాన్,
బ్రహ్మలోకాం, స్తథాపరాన్
ప్రాప్నువంతి మహాత్మానో
మాతాపితృపరాయణాః. 3

[తల్లి దండ్రులను సేవించే మహాత్ములకు దేవ, గంధర్వ, గోలోకాలూ, తరవాత బ్రహ్మ లోకమూ కూడా లభిస్తాయి.]

ఇహలోక దేవతలు



## 60

మందవిసర్పం కప్పలను మోస్తూ రకరకాల విన్యాసాలు చేసింది. కప్పల రాజు, "గజారోహణమూ, బ్రహ్మరథమూ కూడా నాకు ఈ ఆనందాన్ని ఇయ్యవు," అన్నది.

మర్నాడు పాము కప్పలను మోస్తూ చాలా మందంగా నడవసాగింది. అది చూసి జాలపాదం, "ఇవాళ నువు చురుకుగా కదలటం లేదు, ఎందుచేతా?" అని అడిగింది.

"ప్రభూ, తిండిలేని కారణంచేత నీరసంగా ఉండి, వీపు మీద బరువుతో నడవలేకుండా ఉన్నాను," అన్నది పాము.

"దానికేముంది? కులం తక్కువ కప్పలను తిను," అన్నది కప్పల రాజు.

మందవిసర్పం సంతోషంతో, "బ్రాహ్మణుడి శాపంకూడా ఇదే—మీలాటి గొప్ప కులం కప్పలు ఏమి తినమంటే అది తినాలని," అన్నది.

అది మొదలు అది కప్పలను విడవకుండా తింటూ బలం పుంజుకున్నది.

కొంతకాలం అయినాక మరొక పెద్ద పాము అటుగా వచ్చి, మందవిసర్పం కప్పలను మోస్తూ ఉండటం చూసి ఆశ్చర్యపడి, "మిత్రమా, ఈ కప్పలు మనకు సహజమైన ఆహారం కద. నువు వాటిని నీ వీపుమీద ఎక్కించుకుని తిరగటం ఏ మాత్రమూ భావ్యం కాదు," అన్నది.

"నాకు తెలుసులేవోయ్, నెయ్యి తాగి గుడ్డివాడయినట్టు నటించే బ్రాహ్మణుడి లాగా నేను కూడా సమయం కోసం వేచి ఉన్నాను," అన్నది మందవిసర్పం.

"ఏమిటా కథ?" అని రెండో పాము అడిగిన మీదట మందవిసర్పం ఇలా అన్నది:




పూర్వం యజ్ఞదత్తు డనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడి భార్య రంకులాడి. ఆమె నేతితో చేసిన మిఠాయిలు తీసుకుని తన ప్రియుడి వద్దకు పోతూండేది.

ఒకరోజు అతను, "ఏమే, ఈ మిఠాయిలు ఎందుకు చేస్తున్నావు? రోజూ ఎక్కడికి పోతావు?" అన్నాడు.

"ఇక్కడికి దగ్గరలోనే దేవీఆలయం ఉన్నది. రోజంతా ఉపవాసం ఉండి, పరమాన్నమూ, మిఠాయీ దేవికి నైవేద్యం పెట్టటానికి పోతున్నాను," అన్నది భార్య.

ఆ రోజు తాను అలయానికి వెళ్ళినట్టయితే రోజూ అక్కడికే వెళ్ళుతున్నదని భర్త అనుకోగలందులకు ఆమె ఆలయానికివెళ్ళి, గుడిలో ప్రవేశించక పూర్వం స్నానంచెయ్యటానికి కోనేటిలో దిగింది.

ఆమె భర్త మరొక దారిన అలయం చేరి, దేవీవిగ్రహం వెనక దాక్కున్నాడు. త్వరలోనే అతని భార్య స్నానం ముగించి, నైవేద్యంతో సహా గుడిలోకి వచ్చి, దేవికి ధూపదీపార్చన చేసి, నమస్కరించి, "తల్లీ, నా భర్త గుడ్డివాడయే మార్గం ఏమిటి?" అని ప్రార్థించింది.

విగ్రహం చాటున ఉన్న బ్రాహ్మణుడు మారుగొంతుతో, "రోజూ అతడికి నేతి మిఠాయి తినిపించావంటే త్వరలోనే అతని కళ్ళు పోతాయి," అన్నాడు.

బ్రాహ్మణుడి భార్య రోజూ తన భర్తకు నేతి మిఠాయి తినటానికి ఇచ్చింది.

కొద్దిరోజులు గడవనిచ్చి అతను, "నాకు కళ్ళు కనిపించటం లేదు," అన్నాడు.

"ఆహా! దేవి మహిమ!" అనుకున్నది భార్య. ఆమె ఈ వార్త తన ప్రియుడికి చెప్పి, అతన్ని తన ఇంటికి ఆహ్వానించింది.

గుడ్డివాడుగా నటిస్తున్న బ్రాహ్మణుడు వాడి రాక గ్రహించనట్టే ఉండి, అకస్మాత్తుగా వెనకనుంచి దుడ్డుకర్రతో వాడి తల పగలగొట్టి, చంపేశాడు. తరవాత అతను తన దుష్ట భార్య ముక్కు కోసేసి, ఆమెను ఇంట్లో నుంచి వెళ్ళగొట్టాడు.

మందవిసర్పం రెండోపాముకు ఈ కథ చెప్పి, "అయ్యా, నేను కూడా బ్రాహ్మణుడి లాగే వేచి ఉన్నాను," అన్నది.

కాలక్రమాన మందవిసర్పం జాలపాదంతోసహా అన్ని కప్పలనూ మింగేసింది.

ఇదంతా చెప్పి స్థిరజీవి, "మందవిసర్పం కప్పలను మాయమాటలతో నిర్మూలించినట్టే, నేను కూడా గుడ్లగూబలను నిర్మూలించాను," అన్నది.

దానికి మేఘవర్ణం, "సమర్థుడు ఎన్ని అడ్డంకులు వచ్చినా తన లక్ష్యం సాధిస్తాడని ఇందుకే అంటారు. శక్తితో సాధించలేనిది లౌక్యంతో సాధ్యం కావటం చిత్రం కదా?" అన్నది.

"అది నిజమే. శక్తితో శరీరాన్ని మాత్రమే నాశనం చెయ్యవచ్చు, కాని లౌక్యంతో శత్రువు శరీరాన్నే గాక దుష్ప్రచారం ద్వారా పేరు ప్రతిష్ఠలను కూడా నాశనం చెయ్యవచ్చు. రాజా, ఇప్పుడు నువు నిశ్చింతగా రాజ్యపాలన చేసుకో. కాని గుర్తుంచుకో, నువు నీ ప్రజల కోసం ఎప్పుడూ పనిచెయ్యాలి. శ్రమపడితే గాని ఏ చెట్టునూ పడగొట్టలేం, ఏ పనీ సాధించలేం. దృఢ చిత్తుడవై ఉండు. పిరికివాళ్లు ఏమీ సాధించలేరు. చురుకుగా పనులు చెయ్యి. ఇవాళ చేసేది రేపటికి వాయిదా వెయ్యకు. ఎంత చిన్న శత్రువును గాని, చిన్న ప్రమాదాన్నిగాని అలక్ష్యం చెయ్యకు. పాములు తిరిగే కొంపలో నిశ్చింతగా నిద్రించగలమా? వాటిని చంపాలి, లేదా పట్టి, బుట్టలలో పెట్టాలి. నీ ప్రజలను సంతోషపెట్టు, లేని పక్షంలో నీ పరిపాలన అజాగళస్తనం లాగా నిరుపయోగం అవుతుంది. కాలం సమస్తాన్నీ కబళించగలదు; రాజులూ, మంత్రులూ, సింహాసనాలూ, దర్బారులూ కాలగర్భంలో కలిసిపోయేవే. అందుచేత, జీవితం ఉండగానే ప్రజలపట్ల నీ ధర్మాన్ని నెరవేర్చు." అని స్థిరజీవి కాకి రాజుకు హితవు చెప్పింది.

మేఘవర్ణం స్థిరజీవి సలహాలు పాటిస్తూ ప్రశాంతంగా రాజ్యం చేసింది.



# 198. కవచంగల రాక్షసి బల్లి

బొమ్మలో కనిపించే అస్థిపంజరం ఒక కవచంగల రాక్షసిబల్లిది. సైచివాన్ (చీనా) రాష్ట్రంలో దొరికిన ఈ అస్థిపంజరం ఇప్పుడు చుంగ్ కింగ్ మ్యూజియంలో ఉన్నది. కవచంగల రాక్షసి బల్లుల అస్థికలు ప్రపంచంలో అనేక చోట్ల దొరికాయి, కాని అసియాలో పూర్తి అస్థిపంజరం దొరకటం ఇదే ప్రథమం. శాకాహారి అయిన ఈ రాక్షసి బల్లి నిడివి 7 మీటర్లు, ఎత్తు రెండున్నర మీటర్లు. దీని తల చాలా చిన్నది. ముందుకాళ్ళు కురుచ. ఇది 14 కోట్ల సంవత్సరాల క్రితం జీవించింది.





# మాయాసరోవరం

## 30

[ మాయాసరోవరం కేసి పోతున్న కుంటి మంగళవర్మకు, చెట్టుకొమ్మల్లో చిక్కుకుపోయిన రథం తోలేవాడు కనిపించాడు. వాడి ఆర్తనాదాలు విని సిద్ధసాధకుడూ, రాజు కనకాక్షుడూ అక్కడికి వచ్చారు. ఆ సమయంలో జలవృకుల్ని ఉసికొల్పుతూ, ఖడ్గమృగం మీద ఎక్కి వున్న వాడొకడు రావటంతో, చెట్టు మీదినుంచి నరవానరం వాడి మీదికి దూకింది తరవాత—]

జలవృకులు తమ నాయకుడికి రానున్న ప్రమాదాన్ని చూస్తూనే, గుంపుగా వచ్చి, తమ గదలతో నరవానరాన్ని ఎడపెడా కొట్టసాగారు. సిద్ధసాధకుడు శూలం పైకెత్తి, ''జై. మహాకాళా!'' అంటూ ముందుకుదూకి, జలవృకుల్ని అందిన చోట అందినట్టు పొడవసాగాడు.

ఈ విధంగా భయంకరమైన పోరాటం రెండు, మూడు నిమిషాలకాలం జరిగేంతలో నరవానరం రాతి గదల దెబ్బలు బలంగా తగలటంతో సొమ్మసిల్లి ఖడ్గమృగం మీది నుంచి కిందికి పడిపోయింది. ఆ వెంటనే జలవృకుల నాయకుడు తన వాహనాన్ని చుట్టుముట్టిన సైనికుల నుంచి ముందుకు దూకించి, గదను పైకెత్తి ''ఒరే, మానవాధములారా, నేనెవరనుకున్నారు? మాయాసరోవరానికి సర్వాధిపతినైన జలవృకనాథుణ్ణి! ఇప్పుడే



పోయి, నాకు బందీలుగా దొరికిన వాళ్లలో పద్మముఖి అనే కన్యను మాత్రం వదిలి, తతిమ్మావాళ్ళ నందర్నీ, నా రాతిగదకు బలియివ్వ బోతున్నాను,'' అన్నాడు.

నరవానరానికి యింకా బాగా స్పృహ రాలేదు. అది చేతుల్ని అటూ యిటూ తిప్పుతూ, గట్టిగా పళ్ళు కొరుకుతున్నది. దానికి స్పృహ తెప్పించటం తన భటుడైన జలవృకుడికొక్కడికే సాధ్యం అనుకుంటూ సిద్ధసాధకుడు తల తిప్పి, "ఒరే, వృకభటా, ఎక్కడ? నువ్వూ, నీ పాత నేస్తగాళ్లతో పారిపోలేదు గద!'' అన్నాడు.

ఆ వెంటనే జలవృకుడు ముందుకు వచ్చి, సిద్ధసాధకుడికి సాగిలపడి లేచి, ''దొరా, జలవృకరాక్షసుల స్వామిభక్తి ముందు, పుట్టు బానిసలు కూడా దిగదుడుపే! జలవృకుడు మాట తప్పడు, ఏం సెలవు ? '' అన్నాడు.

''ఒరే, వృకభటా, నరవానరానికి తగిలిన రాతిగద దెబ్బలు ప్రాణాపాయం కలిగించేవనుకోను. దాన్ని ఎత్తి, కాళ్ళ మీద నిలబెట్టు.'' అన్నాడు సిద్ధసాధకుడు.

''దొరా, యిలాంటి మృగాలకు చావు భయం ఒక్కటే ఊపిరిపోయగలదు,'' అంటూ జలవృకభటుడు, నరవానరాన్ని సమీపించి, ఎడమచేత్తో దాని గొంతు గట్టిగా పట్టుకుని, రాతిగదను దాని తల మీద ఆనించి, ''నరవానరా, నీ రాచ్చిప్పతల బద్ధలవబోతున్నది!'' అంటూ అరిచాడు.

ఆ మరుక్షణం నరవానరం బిళ్ళం గోడులా ఎగిరి గంతేసి నిలబడి, భయంకరంగా అరుస్తూ, జలవృకభటుణ్ణి రెండు చేతులతో పట్టుకుని ఎత్తి, విసిరివేసింది. వాడు నేలమీద పడేలోపలే కొందరు సైనికులు వాణ్ణి పట్టుకున్నారు.

నరవానరం మరొకసారి జలవృకభటుడి మీదికి పోబోయేంతలో, సిద్ధసాధకుడు శూలం అడ్డంపెట్టి ఆపి, ''ఇక శాంతించు, నరవానరా! మీ యిద్దరూ నా సేవకులే, పోట్లాడకండి,'' అని, జలరాక్షసుల నాయకుడు ఖడ్గమృగం మీద

పారిపోయిన వైపుకు చూసి, ''ఇక ఆ దుర్మార్గుణ్ణి పట్టటం ఎలా? వాడు మాయాసరోవరం చేరినట్టేనా? అదెంత దూరంలో వున్నది?'' అన్నాడు.

వైద్యదేవుడని పిలవబడే దేవశర్మ అతణ్ణి సమీపించి, ''సాధకా, ఆ మాయా సరోవరం యిక్కడికి మరెంతో దూరాన లేదు. అందరూ నా వెంట కదలండి,'' అన్నాడు.

సిద్ధసాధకుడు అంగీకార సూచకంగా తల ఊపాడు. దేవశర్మ ముందుండి దారితీయగా అందరూ కదిలారు. రాజు కనకాక్షుడు అతడి పక్కనే నడుస్తూ, ''శర్మా, ఆ జలరాక్షసుడు పద్మముఖి అనే కన్యనొక్కదాన్ని మాత్రం ప్రాణాలతో వదులుతానంటున్నాడు. అందుక్కారణం ఏమిటో నా కర్థం కాలేదు,'' అన్నాడు.

''మహారాజా, మనం విన్నదాన్నిబట్టీ, చూస్తున్నదాన్నిబట్టీ మాయాసరోవరం పూర్తిగా జలరాక్షసుల స్వాధీనమైపోయి నట్టు తెలుస్తున్నది. పద్మముఖి మాయా సరోవరేశ్వరుడి కుమార్తె. ఆ జలరాక్షసుల నాయకుడు ఆమెను చంపననటంలో మరేం విశేషం లేదు; వాడికొక కొడుకున్నాడు-అదీ సంగతి!'' అన్నాడు దేవశర్మ.

''నా కుమార్తె కాంచనమాలను కూడా మరొక జలరాక్షసుడు వివాహమాడ ప్రయ



త్నించవచ్చు!'' అంటూ రాజు కనకాక్షుడు ఉద్రేకపడిపోయాడు.

''మహారాజా, మీరు అనవసర భయానికి లోనుకాకండి. ఆ మాయాసరో వరం కేసి మహాసత్వుడైన జయశీలుడూ, సరోవరేశ్వరుడూ ఎప్పుడో వెళ్లారు,'' అన్నాడు దేవశర్మ.

దేవశర్మ, రాజు కనకాక్షుడికి యిలా ధైర్యం చెపుతున్న సమయంలోనే జయ శీలుడు మిగతావాళ్ళతో కలిసి మాయా సరోవరాన్ని చేరాడు. ఆ సరోవరం అతి విశాలమైనది. దాని చుట్టూ ఎత్తయిన కొండలూ, నీటి అంచువరకూ పరుచుకు పోయిన మహారణ్యం వున్నది.

సాయంతో నువ్వు జలవృకరాక్షసులను ఊచకోత కోసి, వాళ్ళకు బందీలుగా వున్న నా అన్న కాంచనవర్మనూ, మాయా సరోవరేశ్వర మామగారి కుమార్తె పద్మ ముఖినీ రక్షించాలి,'' అన్నది.

''నేను ఒంటరిగా అంతమంది జలవృకరాక్షసులతో యుద్ధం చేయటమా? ప్రయత్నిస్తాను. మీ నాన్న కనకాక్షరాజు గారికి వాగ్దానం చేసిన విధంగా నిన్నూ, నీ అన్ననూ జలరాక్షసుల నుంచి కాపాడ వలసిన భారం మాత్రం నా మీద వున్నది,'' అన్నాడు జయశీలుడు.

జయశీలుడు యిలా అనగానే మాయా సరోవరేశ్వరుడు ముందుకువచ్చి, అతడి రెండు చేతులూ పట్టుకుని, ''జయశీలా, నేను హిరణ్యపుర రాజుగారి పిల్లల్ని అపహరించి, యీ సరోవరానికి తెప్పించ టంలో పెద్ద నేరం చేశాననుకోకు. మకర కేతుణ్ణి నేను పంపింది, రాజకుమారుడు కాంచనవర్మ నొక్కణ్ణి పట్టుకు రమ్మని మాత్రమే. అతడు బుద్ధిహీనుడవటం వల్ల, అతడితోపాటు సమయానికి కంట బడిన కాంచనమాలను కూడా పట్టుకుని యిక్కడికి పంపాడు. ఆ సమయంలో రాజభటులవల్ల గాయపడి మకరకేతు మీకు కనిపించి, మరికొంత గొడవకు కారణం అయాడు,'' అన్నాడు.



జయశీలుడు సరోవరం నీటిని కత్తితో కెలుకుతూ, ''ఇదన్న మాట, నువు నివసించే మాయాసరోవరం! కాంచన మాల కోరగా, నా మెడకు బిగించిన ఉచ్చును తొలగించావు; బాగానే వున్నది! ఇప్పుడు మనం మిత్రులమా లేక శత్రు వులమా ?'' అని అడిగాడు.

మాయాసరోవరేశ్వరుడు దిగులుగా ముఖం పెట్టి, కాంచనమాల కేసి చూశాడు. కాంచనమాల తడబడే గొంతుతో, "జయ శీలా, యిక్కడ శత్రువులంటూ ఎవరూ లేరు. మకరకేతు చెప్పగా విన్నాను, నీ చేతగల కత్తిని, మహాకాలుడు ఆవే సించిన వాడెవడో ప్రసాదించాడని! దాని

"ఇంతకూ యువరాజును అపహరించుకు రావటంలో నీ ఉద్దేశం ఏమిటి?" అని అడిగాడు జయశీలుడు.

"ఇందులో పెద్ద రహస్యం ఏమీ లేదు. నా ఒక్కగానొక్క కుమార్తె పద్మముఖిని అతడికిచ్చి వివాహం చేసి, హిరణ్యపురానికి పంపి, నేనీ సరోవరాన్ని వదిలి మరెక్కడికైనా పోదామనుకున్నాను. కాని పద్మముఖి, కాంచనవర్మను వివాహమాడనన్నది." అన్నాడు సరోవరేశ్వరుడు.

జయశీలుడికి అతడి మాటలు నమ్మదగినవిలాగే కనిపించినై. అతడు కాంచనమాల కేసి చూశాడు. కాంచనమాల నీటి అంచుకుపోయి, ఒక తామర కాడను తుంచి తెచ్చి, దాన్ని మెలిపెట్టగా వచ్చిన రసాన్ని, జయశీలుడి నుదుటి మీద బొట్టుగా పెట్టి, "మామయ్య చెప్పినదంతా నిజం. ఇప్పుడు మాయాసరోవర రహస్యం కూడా చెప్పేస్తున్నాను. ఈ సరోవరంలో పుట్టి పెరిగిన తామర కాడ నుంచి వచ్చిన రసాన్ని ఎవరైనా ఫాల భాగానికి రాసుకుంటే, యిక వాళ్ళకు నీటిలో నివసించే శక్తి, బతికున్నన్నాళ్లూ వుంటుంది," అన్నది.

"అలాగా! అయితే, పరీక్షించి చూస్తాను!" అంటూ జయశీలుడు ఎగిరి సరోవరం నీటిలోకి దూకాడు.



ఒడ్డున వున్న మాయాసరోవరేశ్వరుడూ, కాంచనమాలా, మకరకేతూ ఒకటి రెండు నిమిషాలు జయశీలుడు నీటిపైకి తేలగలడని చూశారు. కాని, నాలుగైదు నిమిషాలు గడిచినా అతడు నీటిపైకి రాకపోయేసరికి ముందుగా కాంచనమాల ఆదుర్దాపడుతూ, "జయశీలుడికేమైంది? జలవృక రాక్షసులు నీటి అడుగున పొంచి వుండి, అతణ్ణి పట్టుకోలేదు గద?" అన్నది.

ఆ మరుక్షణం నీటిలో పెద్ద కల్లోలమైంది. జయశీలుడు, ఒక యువ జలవృకుణ్ణి మెడపట్టుకుని పైకి తేలి, వాణ్ణి బరబరా ఒడ్డుకు యీడ్చుకు వచ్చాడు.



వాణ్ణి చూస్తూనే మకరకేతు, "హాం, మనకు దొరకవలసిన వాడే దొరికాడు! వీడు జలవృకుల నాయకుడి కొడుకు. బందీలుగా చిక్కిన మనవాళ్ళకు వీడి తండ్రి ఏమైనా హాని కలిగిస్తే, వీణ్ణి చిత్రవధ చేద్దాం," అన్నాడు.

"ఒరే, నువ్వు నీటి అడుగున పొంచి వుండి, మా సంభాషణ అంతా వింటు న్నావా? నీ తండ్రి—ఆ దుర్మార్గుడు జలవృకనాధుడెక్కడ?" అని అడిగాడు మాయాసరోవరేశ్వరుడు కత్తిపైకెత్తి.

"మా నాన్న అరణ్యంలో వున్న ఎవరో రాజునూ, కాపాలికుణ్ణీ హతమార్చటానికి వెళ్ళాడు. తిరిగివచ్చి మిమ్మల్నందర్నీ నరికి కాకులకూ, గద్దలకూ, మొసళ్లకూ ఆహారంగా వేస్తాడు," అన్నాడు యువ రాక్షసుడు.

"ఆ సంగతి తరవాత చూద్దాం. కాంచనవర్మా, పద్మముఖీ ఎక్క డున్నారు?" అని అడిగాడు జయశీలుడు.

"వాళ్ళను దాచిన రహస్యప్రదేశం మా నాన్న ఒక్కడికే తెలుసు," అన్నాడు యువరాక్షసుడు.

అంతలో దూరంగా కలకలం లేచింది. ముందు ఖడ్గమృగం మీద జలవృకుల నాయకుడూ, వెనకగా ఒక గుంపు జల వృకులూ రాతిగదలెత్తి, అక్కడికి వస్తూ, "లొంగిపొండి!" అంటూ అరిచారు.

ఆ వెంటనే జయశీలుడు, మకర కేతుతో, "కేతూ, ఈ జలరాక్షసుడి కొడుకును, నీ జలగ్రహం తొండంతో పట్టి, పైకి ఎత్తేలా చేయి," అన్నాడు.

మకరకేతు, "జలగ్రహా!" అని హెచ్చరించగానే, అది యువరాక్షసుణ్ణి తొండంతో పట్టి పైకిఎత్తింది.

జయశీలుడు తమను సమీపిస్తున్న జలవృకులతో, "ఒరే, దుర్మార్గులారా! మా మీద దాడి చేయాలని చూశారో, ముందుగా మీ నాయకుడి కొడుకు జల గ్రహం కాళ్ళకింద నలిగిపోతాడు," అని గట్టిగా కేకపెట్టాడు.

అంతలో వాళ్ల వెనకనుంచి నరవానరం మీద ఎక్కి వేగంగా వస్తున్న సిద్ధ సాధకుడు, "మహారాజా, మీ సైనికులతో యీ దుర్మార్గుల్ని చుట్టుముట్టండి. అడుగో, జయశీలుడు!" అంటూ అతడి దగ్గిరకు వచ్చి నరవానరాన్ని దిగాడు.

జయశీలుడు, సిద్ధసాధకుడికి తన వెంట వున్న వాళ్ళను పరిచయం చేస్తున్నంతలో, జలవృకరాక్షసుల నాయకుడు ఖడ్గమృగం మీద లేచి నిలబడి, రాతి గదను దూరంగా విసిరివేస్తూ, "నేనూ, నా అనుచరులం లొంగిపోయాం. బందీగా చిక్కిన నా కొడుకును చంపకండి. నేను పట్టుకున్న మీ వాళ్ళనందర్నీ యిప్పుడే యిక్కడికి తెప్పిస్తాను," అన్నాడు.

అంతలో జయశీలుడి దగ్గిరకు రాజు కనకాక్షుడు కూడా వచ్చాడు. కాంచనమాల పోయి తండ్రిని కావిలించుకుని, "నాన్నా, మామ మాయాసరోవరేశ్వరుడికి ఎలాంటి హానీ కలిగించకు. జరిగిన దానికి పశ్చాత్తాపపడుతున్నాడు," అన్నది.

"ఆయన కుమార్తె పద్మముఖి, మీ కోడలు కావటం కొద్దిలో తప్పిపోయింది," అంటూ జయశీలుడు నవ్వాడు.

"పద్మముఖి మనసు నాకు తెలుసు; ఆమె దేవశర్మను వివాహం అడాలనుకుంటున్నది," అన్నది కాంచనమాల.



దేవశర్మ. జలవృక రాక్షసుల నాయకుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టించి, నలుగురు సైనికులు వెంటరాగా జయశీలుడి దగ్గిరకు వచ్చి, "జయశీలా, యీ దుర్మార్గుడు బంధితులై వున్న పద్మముఖీ, కాంచనవర్మలను తెచ్చేందుకు తన అనుచరులను పంపాడు. ఇందులో మోసం వుండదనుకుంటాను," అన్నాడు.

"ఏదైనా మోసం జరిగితే వీడూ, తన కొడుకులాగే జలగ్రహానికి బలైపోతాడు," అన్నాడు జయశీలుడు.

పావుగంట కాలం గడిచే లోపలే నలుగురు జలవృక రాక్షసులు కాంచనవర్మనూ, పద్మముఖినీ అక్కడికి తీసుకు

వచ్చారు. మాయాసరోవరేశ్వరుడూ, రాజు కనకాక్షుడూ పొందిన ఆనందం అంతా యింతా కాదు.

సిద్ధసాధకుడు, ''జై, మహాకాళా!'' అంటూ కేకపెట్టి, ''నేను విన్నదాన్ని బట్టి, పద్మముఖికి దేవశర్మతో వివాహం నిశ్చయమైనట్టే, శుభం! మరి రాజకుమారి కాంచనమాల సంగతేమిటి?'' అన్నాడు.

రాజు కనకాక్షుడు, జయశీలుడి కేసి తల తిప్పి, ''అపహరింపబడ్డ నా పిల్లల్ని తెచ్చిన వీరుడికి అర్ధరాజ్యం యిస్తానని ప్రకటించాను. జయశీలుడు ఆ కార్యం సాధించటమే గాక, మహావీరుడని కూడా అనిపించుకున్నాడు,'' అన్నాడు.

''కాంచనమాలకు అలాంటి మహా వీరుడే తగిన భర్త! అవునా, కాంచనా?'' అన్నాడు సిద్ధసాధకుడు.

కాంచనమాల సిగ్గుపడుతూ, తల వంచుకుని పోయి తండ్రి చాటున నిలబడింది. సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, ''జయశీలుడికీ, కాంచనమాలకూ; పద్మముఖికీ, దేవశర్మకూ హిరణ్యపురంలో మహా వైభవంగా వివాహాలు జరగవలసి వున్నది! ఇక మీరంతా బయలుదేరండి.'' అన్నాడు.

''సాధకా, మరి నీ సంగతేమిటి?'' అని అడిగాడు జయశీలుడు.

''నేనీ మాయాసరోవరం ఒడ్డున మహాకాలుణ్ణి మరికొంతకాలం ఉపాసిస్తాను. ఇక్కడ వున్న జలవృకరాక్షసులూ, అరణ్యంలోని నరభక్షకులూ నా బంట్లు!'' అంటూ సిద్ధసాధకుడు శూలం ఎత్తి పట్టుకున్నాడు.

జయశీలుడూ, రాజు కనకాక్షుడూ, మాయాసరోవరేశ్వరుడూ తమ తమ పిల్లలతో, అనుచరులతో అక్కణ్ణించి బయలుదేరారు. వాళ్ళు కొద్ది దూరం పోగానే జలవృకరాక్షసులూ, చెట్లచాటు నుంచి బిలబిలమంటూ వచ్చిన నరభక్షకులూ, సిద్ధసాధకుడి చుట్టూ చేరి, అతడికి జేజేలుకొడుతూ, నాట్యాలు చేయసాగారు. —(అయిపోయింది)





# పిశాచాల బాకీ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్లి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఈ పడే శ్రమ స్వార్థంకొద్దీ పడుతున్నావో, నిస్వార్థంగా పడుతున్నావో నాకైతే తెలీదుగాని, పూర్వం పర్వతుడు అనేవాడు తన స్వార్థం ఏమాత్రమూ చూసుకోకుండా, ముక్కూ మొగమూ ఎరగని వాడికి సహాయపడ్డాడు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతని కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం ఒక కుగ్రామంలో ఊరి చివర పేదవాళ్ళ గుడిసెలలో పర్వతుడు అనే కటిక పేదవాడూ, అతని భార్యా ఉండేవారు. అతని గుడిసెను ఆనుకుని ఒక శిథిలమైన మరొక పాక ఉండేది. ఒక

## బేతాళ కథలు



నాడు అందులోకి ఒక ముసలివాడు వచ్చిచేరాడు. ఆ ముసలివాడు రోగిష్ఠి అనీ, ఎవరూ దిక్కులేరనీ పర్వతుడు గ్రహించాడు. అతడికి ఏదన్నాసహాయం చేతామన్నా కూడా పర్వతుడికి శక్తిలేదు.

ఆ మాటే అంటే పర్వతుడి భార్య, ''తాను దూర కంతలేదు, మెడకొక డోలు అన్నట్టు, మన పొట్టలు మనం నింపుకోవటమే గగనంగా ఉంటే, ఊళ్ళో ఉన్న దిక్కులేని వాళ్ళను ఎలా ఉద్ధరిస్తాం? ఏ జన్మాన చేసుకున్నాడో, అనుభవిస్తున్నాడు. ఇవాళో రేపో వాడి ప్రాణం గుటుక్కుమంటుంది. అంతటితో వాడి కష్టాలు తీరిపోతాయి,'' అన్నది.

తన భార్య అన్న మాటల్లో అబద్ధం ఏమీ కనిపించలేదు పర్వతుడికి. కాకపోతే ఆ ముసలివాడు తెల్లవార్లూ దగ్గుతూ పర్వతుడికి నిద్రలేకుండా చేసేవాడు. వాడి గొంతు నులిపి చంపేసి, వాడికి బాధ లేకుండా చేస్తే తనకు రాత్రిళ్ళు నిద్రసుఖమూ, పరలోకంలో పుణ్యమూ వస్తుందేమోనని పర్వతుడు చాలాసార్లు అనుకున్నాడు.

ఇంతలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఒకనాటి రాత్రి ముసలివాడి దగ్గు మూలాన నిద్రపట్టక, పర్వతుడు గుడిసె నుంచి బయటికి వచ్చేసరికి, అతనికి ఒక వింత ఆకారం ఎదురయింది.

''ఎవరు నువు?'' అని అడిగాడు పర్వతుడు.

"నేను పిశాచాన్ని!" అన్నాడు ఆ వ్యక్తి.

పర్వతుడికి ముచ్చెమటలు పోశాయి. అతను నిలువునా వణికిపోతూ, ''ఏం కావాలి నీకు?'' అని అడిగాడు.

''ఈ మూటలో డబ్బున్నది. దీన్ని ఆ ముసలివాడికిచ్చి, వాణ్ణి నగరానికి తీసుకుపోయి, ఈ డబ్బుతో వాడికి చికిత్స చేయించు,'' అన్నాడు పిశాచం.

అంత పరోపకార బుద్ధిగల పిశాచాన్ని చూసి దడుచుకోవటం మరిచిపోయి, పర్వతుడు ఆసక్తిగా, ''ఈ ముసలివాడి

మీద నీకు ఇంత అనుగ్రహం ఎందుకు కలిగింది? బతికున్న వాళ్ళెవరూ వాణ్ణి గురించి పట్టించుకోవటం లేదే?'' అన్నాడు.

పిశాచం ఇలా చెప్పాడు:

''ఆ ముసలాడు ఎంత గొప్పవాడో నువు ఊహించలేవు. ఒకప్పుడు గొప్ప ధనికుడు కూడాను. అంతకన్న గొప్ప దాత. నేను చిన్నతనంలో ఒక లక్షాధికారి వద్ద పనిచేసేవాణ్ణి. ఒకసారి పదివేల వరహాల నగదు ఇచ్చి, మా యజమాని కొన్ని విలువైన వస్తువులు కొనుక్కు రమ్మని నన్ను నగరానికి పంపాడు. నేను సత్రంలో దిగి, ఆ రాత్రే డబ్బు పోగొట్టు కున్నాను. నా యజమానికి నా మీద సంపూర్ణమైన విశ్వాసం. దొంగలు డబ్బు కాజేశారని చెబితే నా అశ్రద్ధే రుజువవు తుంది. ఒకవేళ నేను చెప్పిన మాట నా యజమాని నమ్మకపోతే నాకు అంత కన్న వేరే చావు ఉండబోదు. అందుచేత నేను నదిలోపడి ఆత్మహత్య చేసుకో బోయాను. నన్ను నలుగురూ చేరి రక్షించారు. ఎందుకు చచ్చిపోదామను కున్నావు అని పదిమందీ అడిగితే నిజం చెప్పాను. అయినా ఎవరూ నా పైన సానుభూతి చూపలేదు. ఒక్క యువకుడు మాత్రం నన్ను తన ఇంటికి తీసుకు



పోయి, రహస్యంగా నాకు పదివేల వరహాలు ఇచ్చి, అంత డబ్బుతో నేను సత్రంలో దిగటం పొరపాటనీ, ఇంకోసారి వస్తే తన ఇంట దిగమనీ చెప్పి, నా చేత అవసరమైన సరుకు కొనిపించి పంపే శాడు. ఆ యువకుడే ఈ ముసలాడు. నేను బతికుండగా మళ్ళీ అతన్ని చూడ లేదు. ఇటీవల నేను చచ్చిపోయి, అతని రుణాన పిశాచాన్నయి, అతను ఈ అసహాయ స్థితికి దిగజారినట్టు తెలుసు కున్నాను. ఈ డబ్బు నువు ముసలాడి కిచ్చి, నన్ను రుణవిముక్తుణ్ణి చెయ్యి. నీకు పుణ్యం ఉంటుంది,'' అని తన డబ్బు సంచీ పర్వతుడి కిచ్చి, మాయమయాడు.



తెల్లవారి ఏం చెయ్యాలో తేల్చుకుందామని పర్వతుడు డబ్బు సంచీ తీసుకుపోయి లోపల ఉంచాడు. ఇంతలో ఎవరో తలుపు తట్టారు. పర్వతుడు తలపు తెరిచేసరికి పిశాచం బయట కనిపించాడు.

''ఏం మళ్ళీ వచ్చావు?'' అని పర్వతుడు పిశాచాన్ని అడిగాడు.

''మళ్ళీ రావటమేమిటి? నేను ఇప్పుడే వస్తున్నాను. నేను ఈపక్క పాకలో ఉండే ముసలివాడికి రుణపడి ఉన్నాను. ఈ డబ్బు అతనికిచ్చి, దీనితో నగరంలో చికిత్స పొందమని చెప్పు,'' అంటూ పిశాచం మరొక డబ్బు సంచీ పర్వతుడికి ఇచ్చాడు. పర్వతుడికి కుతూహలం కలిగి, ''నువు ముసలాడికి ఎలా రుణపడ్డావు?'' అన్నాడు. రెండో పిశాచం ఇలా చెప్పాడు:

''నాకు కుటుంబ భారం హెచ్చుగా ఉండేది. సంపాదన అంతంత మాత్రం. ఇలా ఉండగా నా అయిదేళ్ళ కూతురికి ప్రాణం మీదికి వచ్చింది. నగరం తీసుకుపోతే పిల్లకు చికిత్స చెయ్యగల ఘన వైద్యులున్నారని తెలిసింది. సకుటుంబంగా నగరం వెళ్ళాను. అక్కడ పేరు మోసిన వైద్యుడికి చూపిస్తే, పిల్లకు ఆరునెలలపాటు చికిత్స జరగాలనీ, అయిదారువేల వరహాలు ఖర్చు అవుతుందనీ అన్నాడు. అంతడబ్బు నేనెక్కడి నుంచి తీసుకురాగలను? ఇక పిల్ల మీద ఆశవదిలి ఏడుస్తూ కూర్చున్నాం. మా పొరుగున ఉన్న ఒక నడివయసువాడు మా సంగతి విని మా దగ్గిరికి వచ్చి, పిల్ల ప్రాణంకన్న డబ్బు ఎక్కువా అని నా చేతికి పదివేల వరహాలు ఇచ్చాడు. ఆరునెలలు చికిత్స చేయించాను. పిల్ల బతికింది. కాని ఆ నడివయసువాడి రుణం అలాగే ఉండిపోయింది. ఆ కారణంచేత పిశాచాన్నయి, నాకు ఆనాడు సహాయపడిన వాడు ఈ ముసలివాడేనని తెలుసుకుని, రుణవిముక్తి పొంది, పిశాచి జన్మ వదిలించుకుందామని ఇలా వచ్చాను.''

రెండో పిశాచం కూడా డబ్బుసంచీ పర్వతుడికి ఇచ్చి మాయమయింది.

పర్వతుడు రెండు సంచులూ లోపల పెట్టి, తన భార్యను నిద్రలేపి, "ఏమే, ఇంత డబ్బు నీ జన్మలో ఎన్నడైనా చూశావా?" అంటూ రెండు సంచులూ పెళ్ళానికి చూపాడు. అవి ఎలా వచ్చినదీ భర్త నుంచి విని, పర్వతుడి భార్య, "డబ్బు ఈ ముసలాణ్ణి కాపాడలేదు. వాడి జీవితం ముగిసింది. నాలుగు కాలాల పాటు బతికి, పిల్లలను కని పోషించవలసిన వాళ్ళం! ఈ డబ్బు మనమే ఉంచేసుకుందాం!" అన్నది.

"లేదు. దీన్ని ముసలాడికే ఇద్దాం!" అన్నాడు పర్వతుడు.

"పోనీ, ముసలాడికి ఒక సంచీ ఇచ్చి, రెండోది మనం ఉంచుకుందాం," అన్నది భార్య.

పర్వతుడికి అలా చేస్తే బాగుంటుందనిపించింది, కాని చాలాసేపు తన మనసులో మథనపడి, "వద్దు! రెండు సంచులూ ముసలివాడికే ఇద్దాం," అని, మర్నాడు అలాగే చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పర్వతుడు అలా ప్రవర్తించటానికి కారణం అతనిలో స్వార్థం లేకపోవటమా? లేక పిశాచాల సొమ్ము తాకటానికి భయపడ్డాడా? సమాధానం తెలిసికూడా చెప్పకపోతే తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అదేమీకాదు, ఒక మనిషికి రుణపడిన కారణంగా ఇద్దరు మనుషులు చచ్చి పిశాచాలు కావటం గురించి విని ఉన్నాడు. తనకు పిశాచాలు ఇచ్చినడబ్బు ఆ ముసలాడిది. అది తాను వాడుకుంటే ముసలాడికి తాను రుణపడిపోయి, తాను పిశాచి జన్మ ఎత్తవలసి వస్తుంది. అందుకనే పర్వతుడు ఆ డబ్బు తాకటానికి భయపడ్డాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)



# ఒకే నీతి

వీరన్న ఒక పాలవ్యాపారి కొడుకు. తండ్రి అడుగుల జాడలో తాను కూడా వ్యాపారంలో చాలా డబ్బు గడిస్తున్నాడు. అందుచేత సోమయ్య అనే రైతు తన కూతురు అంకాళమ్మను వీరన్నకిచ్చి పెళ్ళిచేసి, తన ఆస్తి అంతా అతనికే రాసి ఇచ్చి, తాను కూడా అల్లుడి నీడనే జీవించసాగాడు.

వీరన్న దగ్గిర వట్టిపోయిన పశువులు ఉండేవి. వాటిని అతను కసాయివాళ్ళకు అమ్మక, శ్రద్ధగా పోషిస్తూ వచ్చేవాడు. అది చూసి అంకాళమ్మ, "ముసలి పశువులను పోషించటం వృథా కదా? వాటిని కసాయివాళ్ళకు అమ్మితే డబ్బు అదనంగా వస్తుందే!" అన్నది. ఒకప్పుడు మనను పోషించిన పశువులను మనం పోషించటం ధర్మమన్నాడు వీరన్న. అంకాళమ్మ ఒప్పుకోలేదు.

మర్నాడు వీరన్న తన మామతో, "మామా, మిమ్మల్ని పోషించటం డబ్బు దండుగ. మీ దారి మీరు చూసుకోండి," అన్నాడు. "ఆయన ఆస్తి అంతా తీసుకుని ఆయనను వెళ్ళగొడతావా? అదేం నీతి?" అని అంకాళమ్మ మొగుడి మీద లేచింది.

"నిన్న నువు చెప్పిన నీతే గద!" అన్నాడు వీరన్న.

ఆ తరవాత అంకాళమ్మ పశువుల మాట మరి ఎత్తలేదు. —కోలార్ కృష్ణఅయ్యర్.





# తగిన శాస్తి

చియాంగ్‌కు చుంగ్-వాన్ పిసినిగొట్టు తనం నచ్చేదికాదు. ఒకసారి చియాంగ్ "వినోదపు బొమ్మల పెట్టె'' అద్దెకు తెచ్చుకున్నాడు.

దాన్ని చూసి చుంగ్-వాన్ ఆ పెట్టెను తనకు కూడా ఒకసారి ఇయ్యమని అడిగాడు.

దానికిచియాంగ్, ''నువుపిసినిగొట్టువు. ప్రతిఫలంగా నాకు నువు సహాయం చేస్తా నంటేనే నిన్ను బొమ్మలాట పెట్టె చూడ నిస్తాను. అదయినా నువు మాయింట్లోనే చూడాలి,'' అన్నాడు.

చుంగ్-వాన్ ఆ షరతులను ఆమో దించి చియాంగు ఇంటికి వెళ్ళి, పెట్టెలో బొమ్మలాట చూశాడు.

తరవాత ఒకసారి చియాంగ్‌కు నేల చదును చేసేటందుకు దిమ్మెస కావలసి వచ్చింది. చుంగ్-వాన్ వద్ద దిమ్మెస ఉన్నది. మామూలుగా అయితే అతను దాన్ని ఇయ్యడు. కాని బొమ్మలపెట్టె చూడనిచ్చినందుకు ప్రత్యుపకారం చేస్తా నన్నాడు గనక, దిమ్మెస తీసుకునే టందుకు చియాంగ్ చుంగ్-వాన్ ఇంటికి వెళ్ళాడు.

ఆ సమయంలో చుంగ్-వాన్ ఇంట్లోనే ఉన్నాడు

''చుంగు-వాన్, ఒకసారి నాకు నీ దిమ్మెస కావాలి. ఇయ్యగలవా ?'' అని చియాంగ్ అడిగాడు.

''తప్పకుండా ఇస్తాను. కాని నువు దాన్ని మా ఇంట్లోనే ఉపయోగించాలి!'' అన్నాడు చుంగ్‌వాన్.

చియాంగ్‌కు చుంగ్-వానును చూస్తే చీదర పుట్టింది అతని పిసినారి తనానికి ఎలాగైనా బుద్ధి చెప్పాలని అతను అను కున్నాడు.

---

మారుపాక సంధ్యారాణి

చుంగ్-వాగ్‌కు ఒక మేక ఉన్నది. అతను దాన్ని సంతలో అమ్మాలను కున్నాడు సంతకు వెళ్లాలంటే కాలవ దాటాలి. కాలవ దాటేవాళ్లకు చియాంగ్ బల్లకట్టు ఉపయోగపడుతుంది. అతని వృత్తి బల్లకట్టు నడపటమే. కాలవ దాటించటానికి మనిషికైనా, జంతువు కైనా ఒక కాసు తీసుకుంటాడు చియాంగ్

మేక ఈనటానికి సిద్ధంగా ఉన్న సమయంలో చుంగ్-వాన్ సంతకు బయలు దేరాడు. చూడిమేకకు హెచ్చుధర పలుకుతుందని అతని ఆశ. అతను తనకూ, మేకకూ అని రెండు కాసులిచ్చి చియాంగ్ దగ్గిర నుంచి రసీదు పుచ్చుకున్నాడు.

అయితే మేక కాలవ దాటుతూండగా, బల్లకట్టు మీదనే ఈనింది. చుంగు-వాన్ చాచా సంతోషించాడు. ఎందుకంటే ఆ మేక బల్ల కట్టు మీద ఎక్కక ముందే ఈని ఉంటే, మేకపిల్లకు అతను మరొక కాసు ఎక్కువ ఇచ్చుకోవలసి వచ్చేది.

కాలవ అవతలి ఒడ్డు చేరగానే చుంగ్-వాను మేకపిల్లను ఎత్తుకుని, మేకను లాగుతూ బల్లకట్టు దిగబోయాడు కాని చియాంగు అతని చేతిలోని మేకపిల్లను తీసేసుకుని, చుంగు-వానును మేకతో సహా దిగిపొమ్మన్నాడు.

చుంగు-వాను ఆ మేకపిల్ల తనదని లబలబలాడాడు. చియాంగు మేకపిల్ల తనదేనన్నాడు. ఈ ఘర్షణ చూసి చాలా మంది అక్కడ పోగయారు. చుట్టూ ఉన్నవారితో న్యాయం చెప్పమని చుంగ్-వేడుకున్నాడు.

''పద్దు చూసుకో. అందులో నువూ, మేకా మాత్రమే ఉన్నారు,'' అన్నాడు చియాంగు.

అందరూ చియాంగు పక్షమే మాట్లాడారు. చుంగు-వాను ఎలాటి పిసినిగొట్టో అందరికీ తెలుసును. అతనికి అపాటి శాస్తి జరగవలిసిందేనని అందరూ అనుకున్నారు.



# అంతా అమాయకులే

శ్రీపురం గ్రామ ప్రజలు చాలా అమాయకులు. వారికి తమ కరణంగారు ఎంత చెబితే అంతే. కరణంగారి స్నేహితుడైన మునసబుగారంటే కూడా వాళ్ళకు గురే.

కరణంగారు ఊరివారితో, తనకు మహారాజుగారు రోజూ కలలో కనిపిస్తూంటారనీ, ఆయన ఇచ్చే సలహా ప్రకారమే తాను వ్యవహరిస్తాననీ చెప్పేవాడు.

ఒకరోజు కరణంగారు ఉదయంపూట విచారంగా కూర్చుని ఉండటం చూసి, కొందరు కారణం అడిగారు.

"రోజూ కలలో కనిపించే మహారాజుగారు నిన్న రాత్రి కలలోకి రాలేదు. వారు దేహం చాలించి ఉండాలి," అని కళ్ళు తుడుచుకున్నాడు కరణం.

మహారాజు "మరణవార్త" ఊరంతా పాకి, అందరూ రచ్చబండ దగ్గిర చేరి రకరకాలుగా తమ విషాదాన్ని వెలిబుచ్చుతున్నారు. అది తెలిసి మునసబు అక్కడికి వచ్చి, "ఎందుకర్రా ఏడుస్తారు? మహారాజుగారు మరణించలేదు. ఆయన నిన్న రాత్రంతా నా కలలోనే ఉన్నారు. అందుచేత కరణంగారి కలలోకి వచ్చే అవకాశం ఆయనకు లేక పోయింది," అని అందరికీ ఆనందం చేకూర్చాడు. —పోలిశెట్టి సత్యనారాయణరావు.





# పరలోకప్రయాణం

కోటయ్య లెక్కలేని పాపాలుచేసి, కోటికి పడగెత్తాడు. అతనికి వృద్ధాప్యంలో పాప భీతి పట్టుకున్నది. తన అన్యాయాలకు బలి అయిన వాళ్ళు భూతాల్లాగా కలల్లో కనిపిస్తూ, అతనికి మనశ్శాంతి లేకుండా చేయసాగారు. ఈ బాధ పడలేక కోటయ్య సన్యాసం పుచ్చుకోవటానికి నిశ్చయించుకుని, ఇంటిల్లి పాదినీ పిలిచి, ఆ సంగతి చెప్పాడు.

"మీరుపోతే, నాకు మాత్రం దేనికీ సంసారం? నేనూ వస్తాను," అన్నది కోటయ్యభార్య.

"చెట్టంత కొడుకు సాధువుల్లో కలుస్తుంటే చూస్తూ ఎలా ఉంటాను? నన్ను కూడా తీసుకుపొండి," అన్నది ముసలి తల్లి.

"అంతా కట్టకట్టుకు ఒక్కసారి పోతే, వల్లకాడులాంటి ఈ ఇంట్లో నేను ఒక్కణ్ణీ ఉండగలనా? నేనూ మీతో బాటే!" అన్నాడు కొడుకు.

తనమీద తన వాళ్ళకుగల ప్రేమ చూసి కోటయ్య ఆనంద పడిపోయి, "అయితే ఒక పని చేద్దాం. నేను ఎక్కడికీ పోకుండా, ఊరి అవతల ఒక మఠం కట్టించి, అందులో భజనలు చేసుకుంటూ బతుకుతాను. మీతో ఉన్నట్టూ ఉంటుంది, ఎన్నాళ్ళుగానో వున్న నా కోరికా తీరుతుంది," అన్నాడు.

ఈ పద్ధతి ఇంట్లో అందరికీ నచ్చింది.

వారం తిరిగేసరికి ఊరి పొలిమేరలో ఒక పర్ణశాలతో కూడిన ఆశ్రమం వెలిసింది. మంచి పాకనిపుణులైన వంటవాళ్ళూ, అహోరాత్రాలు భజనలు చెయ్యటానికి కిరాయి మనుషులూ ఏర్పాటు చేయబడ్డారు. ఖర్చు హెచ్చుగా ఉన్నందుకు కోటయ్య మొదట్లో బాధపడినా, అదంతా

వీరేపల్లి జయరాంరెడ్డి

తన కోసమేగదా అని మనసులో సరిపెట్టుకున్నాడు.

ఆశ్రమం ఖ్యాతి ఊళ్ళోకి పాకింది. ఊళ్ళో జనం, పిల్లా పీచూ తోసహా, సాయంత్రమయేసరికి ఆశ్రమంలో హాజరు కాసాగారు. కోటయ్య మాట ఏమైనా, పై వాళ్ళు మాత్రం భక్తిలో ఓలలాడారు.

ఒకనాటి రాత్రి, భజనచేసి, పంచ భక్ష్యాలతో భోజనం చేసి, అలసి నిద్ర పోయిన కోటయ్యకు ఒక కల వచ్చింది. ఆ కలలో దేవుడు ప్రత్యక్షమై, "కోటయ్యా, నువు అనుకోకుండానే మీ ఊరికి గొప్ప మేలుచేశావు. ఊళ్ళో నా భక్తుల సంఖ్య పెంచావు. అందుకు ప్రతిఫలంగా నిన్ను వైకుంఠానికి తెప్పించుకునేటందుకు రేపే విమానం పంపిస్తాను. దానిలో బయలు దేరిరా!'' అన్నాడు.

కోటయ్య ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోతూ, తన భార్యను పిలిచి, సంగతి చెప్పి, ''ఇన్నేళ్ళూ నా పాపాలలో భాగం పంచుకుని, నాతో కాపరం చేశావు. నువు కూడా నా వెంట వైకుంఠానికి రా!'' అన్నాడు.

''వస్తాగాని, పిల్లవాణ్ణి విడిచి క్షణం ఉండలేను. వాణ్ణి కూడా తీసుకుపోదాం, పిలవండి,'' అన్నది భార్య.

కోటయ్య కొడుకును పిలిచి, వైకుంఠానికి పదమన్నాడు.

''నాతో నా భార్య కూడా రావాలి,'' అన్నాడు కొడుకు.



ఇంతమంది వస్తూంటే తన ముసలి తల్లి మాత్రం ఎందుకు రాగూడదనుకుని, కోటయ్య తల్లిని పిలిచాడు.

"ఒరేయ్, రక్తం పంచుకు పుట్టిన నీ తమ్ముణ్ణి వదిలేసి వైకుంఠానికి పోవటానికి నీ మనసు ఒప్పినా, కని పెంచిన దాన్ని నా మనసు ఎట్లా ఒప్పుతుందిరా?" అని ముసలిది చెప్పింది.

విధిలేక కోటయ్య తమ్ముడి ఇంటికి వెళ్లి, వాణ్ణి వైకుంఠానికి ఆహ్వానించాడు. గొలుసు కట్టులాగా తమ్ముడి వెంట అతడి ఇంటిల్లిపాదీ ప్రయాణమయారు.

తెల్లవారు ఝామున ఆశ్రమంలో విమానం దిగింది. అందులో కోటయ్య వెంట అతని తల్లీ, భార్యా, కొడుకూ, తమ్ముడూ, అతని బలగమూ ఎక్కి కూర్చున్నారు. విమానం పైకి లేచింది.

"విమానంలో ఇంతమంది ఎక్కి కూర్చున్నాంగదా, ఇది మొయ్యగలదా?" అని కోటయ్య అనుమానిస్తూండగానే, ఆకాశంలో విమానం అటూ, ఇటూ ఒరగసాగింది, బాగా బరువు ఎక్కువైన పడవలాగా.

"అనుకున్నంతా అయింది! ఇది ఒక్కణ్ణి మాత్రమే మోసేదిలాగుంది. నన్ను వెళ్లిపోనిచ్చి, మీరంతా దూకెయ్యండి," అని కోటయ్య అరిచాడు.

విమానం ఏక్షణాన అయినా తలకిందులు అయేలాగుంది.

ఒక్కడూ దూకలేదు. పైపెచ్చు, "అందర్నీ వదిలిపెట్టి నువు ఒక్కడివే వైకుంఠానికి పోతావా?" అంటూ మిగిలినవాళ్ళు కోటయ్యను గట్టిగా పట్టుకుని, విమానం నుంచి బలవంతంగా కిందికి తోసేశారు.

ఆకాశం నుంచి కిందికి పడిపోతున్న కోటయ్యను భూతపిశాచాలు పట్టుకున్నాయి.

అంతే! ఒక్క చావుకేకపెట్టి చివ్వున లేచి కూర్చున్నాడు కోటయ్య. అదంతా కల అని తెలుసుకోవటానికి కోటయ్యకు కొంతకాలం పట్టింది.



# బేరంచేసే పద్ధతి!

రామయ్య పల్లెటూరివాడూ, అమాయకుడూనూ. అతను కొంత డబ్బు తీసుకుని, పట్నంలో ఏదైనా కొనాలని బయలుదేరాడు. ఈ సంగతి తెలిసి అతని స్నేహితుడు ఒకడు, "పట్నంలో మోసాలు పరిపాటి. ఏ వస్తువు కొనాలన్నా, అమ్మేవాడు చెప్పిన దానిలో సగం ధరకు అడుగు," అని సలహా ఇచ్చాడు.

పట్నం చేరిన రామయ్య ఊరంతా కలయతిరుగుతూ, ఒక గొడుగుల దుకాణం దగ్గిర ఆగి, గొడుగు ధర అడిగాడు. పదిరూపాయలన్నాడు దుకాణం వాడు. రామయ్య వెంటనే, "అయిదు రూపాయలకిస్తావా?" అని అడిగాడు.

రామయ్య పల్లెటూరి మొహం కనిపెట్టి, దుకాణంవాడు తమాషా చూద్దామని, ఆరు రూపాయలకిస్తానన్నాడు.

వెంటనే రామయ్య, "మూడు రూపాయిలకిస్తావా?" అని అడిగాడు.

"ఊరికే ఇస్తా తీసుకో," అన్నాడు దుకాణం వాడు.

"అయితే రెండు గొడుగులిస్తావా?" అన్నాడు రామయ్య.

"ఇక దయచెయ్యి," అని దుకాణం వాడు రామయ్యను పంపేశాడు. —ఫణి విఠల్.






ఆ ఊళ్ళో రత్తయ్య ధనవంతుడూ, తెలివైనవాడూనూ. అతనికి ముగ్గురు కొడుకులు. పెద్దవాళ్ళు అప్పయ్యా, రామయ్యా ప్రాజ్ఞులై, వ్యవసాయంలో తండ్రికి సాయం చేస్తున్నారు. మూడోవాడు రంగడు మందమతి. రత్తయ్యకు వాణ్ణి గురించే బెంగగా ఉండేది. రంగడి తెలివితేటలు పెరగటానికి ఔషధాలుగాని, మంత్ర తంత్రాలుగాని ఎందుకూ పనికిరాలేదు.

''నేను ముసలివాణ్ణి అయిపోయాను. ఇంక శ్రమపడలేను. పెద్దవాళ్ళిద్దరూ నెగ్గుకురాగలరు. రంగడి గురించే నాకు దిగులూ, భయం. వాడు ఎలా బతుకుతాడో ఏమో!'' అని రత్తయ్య తన స్నేహితులతో అన్నాడు.

''రంగడిని గురించి నువు చెయ్యగలిగినదేమీ లేదు. వాడికి బతికి ఉన్నంత కాలమూ ఏ లోటూ లేకుండా ఏర్పాటు చేసెయ్యి, చాలు,'' అన్నారు రత్తయ్య స్నేహితులు.

ఇలా ఉండగా ఒకనాడు రత్తయ్య ఇంటి ముందు ఒక బండి ఆగింది. అందులో నుంచి శంకరం అనేవాడు రామయ్యను దింపాడు. రామయ్య కుడి కాలు మడిచికట్టి ఉన్నది.

''ఏమయింది? ఏమయింది?'' అని రత్తయ్య ఆదుర్దాగా అడిగాడు.

''రామయ్య మామిడి చెట్టుమీది నుంచి పడిపోయాడు. కాలు విరిగింది. వెంటనే వైద్యుడికి చూపిస్తే, ఎముక విరిగిందనీ, అది తిరిగి అతకదనీ అన్నాడు.'' అని శంకరం రత్తయ్యకు చెప్పాడు.

''వీణ్ణి వెంటనే పట్నం తీసుకుపోయి, మంచి వైద్యుడికి చూపింతాం. ఖర్చయితే

గుండాల విజయ

అయింది. వాడికి కాలు తిరిగి రావటం ముఖ్యం,'' అన్నాడు రత్తయ్య.

''లాభం లేదండీ. వాడి కాలు బాగు కాదని వైద్యుడు ఖచ్చితంగా చెప్పాడు,'' అన్నాడు శంకరం.

రామయ్య కూడా తన కాలు మరి బాగుకాదని అధైర్యపడిపోయినవాడిలాగా, ''అవును, నాన్నా! నేను శాశ్వతంగా అవిటివాణ్ణి అయిపోయాను,'' అని ఏడ్చాడేగాని, పట్నం పోయి మంచి వైద్యుణ్ణి చూడాలన్న ఆత్రం ఏ మాత్రం కనబరచలేదు.

అటు తరువాత రామయ్య అవకాశం దొరికినప్పుడల్లా తన కుంటికాలు ఊపు కుంటూ తనకు కనిపించటమూ, "నాన్నా, నా బతుకు ఏంగానూ?'' అని ఏడవటమూ చూసి రత్తయ్యకు జుగుప్స కలుగుతూ వచ్చింది.

గ్రామాధికారి సమక్షంలో రత్తయ్య ఫలాని రోజున తన కొడుకులకు ఆస్తి పంచుతున్నాడని ఊళ్ళో అందరికీ తెలిసి పోయింది. అందరూ అది చూడటానికి గ్రామాధికారి ఇంటికి వచ్చారు.

రత్తయ్య తన ఇరవై ఎకరాల మాగాణినీ, ఎద్దులనూ, నాగళ్ళనూ తన పెద్ద కొడుక్కూ, మూడో కొడుక్కూ సమంగా పంచుతానన్నాడు; తనకున్న



గోవులనూ, ఇంటినీ రెండో కొడుకు రామయ్యకు ఇయ్యదలిచాడు.

రత్తయ్య నిర్ణయం విని, అక్కడ చేరిన వారంతా ముక్కుమీద వేలు వేసు కున్నారు. ఊళ్ళో అందరికీ న్యాయం చెప్పగల రత్తయ్య తన రెండో కొడుక్కు అంత అన్యాయం చేస్తాడంటే ఎవరూ నమ్మలేకపోయారు. రత్తయ్య ధోరణికి కారణం ఏమైవుంటుందో ఎవరికీ అంతు చిక్కలేదు.

''నాన్నా, అన్యాయం! ఆస్తిలో మూడు వంతులు వాళ్ళిద్దరికీ ఇచ్చి, నాలుగో వంతు నా కియ్యడం సబబు కాదు. ఏ తండ్రీ తన కొడుక్కు ఇలాటి అన్యాయం

చెయ్యడు. నీ చేత ఈ ఘోరం చేయించిన వాడు ఎవడో ఇక్కడే ఉండి ఉండాలి. వాడి పేరు చెప్పు. వాడి ప్రాణాలు తీస్తాను,'' అని రామయ్య పళ్ళు కొరుకుతూ, తన అన్న అప్పయ్య కేసి చూశాడు.

రత్తయ్య ఒక్కసారి అక్కడి జనం కేసి చూసి, ''అవును, రామయ్య చెప్పినది అక్షరాలా నిజం. నేను ఇలాటి పక్షపాతపు నిర్ణయం చేసేటట్టు ప్రేరేపించిన మనిషి ఇక్కడే ఉన్నాడు. వాడి పేరు రామయ్య. చిన్నప్పటి నుంచీ రామయ్యకు డబ్బుమీద ఆపేక్ష మెండు. మందమతి అయిన రంగడి మీద నాకు ప్రేమాభిమానాలుండటం రామయ్యకు ఇష్టంలేదు. ఆస్తి విభజన అయేలోపుగా నా ప్రేమాభిమానాలను తన కేసి తిప్పుకునే ఉద్దేశంతో రామయ్య తాను చెట్టు మీదినుంచి పడి, కాలు విరగ గొట్టుకుని అవిటివాడయినట్టు నటించాడు. తనకు ఈ నాటకంలో సాయం చేసిన శంకరానికీ, వైద్యుడికీ డబ్బు ఇచ్చాడు. ముందు నేను రామయ్య అవిటి వాడయినట్టు నమ్మాను, కాని త్వరలోనే నిజం తెలుసుకున్నాను. ఆస్తి పంపకం అయినదాకా వాడు కాలుకట్టు విప్పడని గ్రహించి, పంపకం ప్రారంభించాను. నాకు రామయ్య ఆడిన కపట నాటకం చూసినతరవాత, వాడి మీద జాలికలగటానికి బదులు అసహ్యం కలిగింది,'' అన్నాడు.

గ్రామాధికారి రామయ్యతో, ''ఒరే, నువు నిజంగా అవిటివాడివే అయితే మీ నాయన నిర్ణయించిన ఆస్తి పంపకం దివ్యంగా ఉన్నది గద! కాలులేని వాడివి పొలం ఎలా దున్నుతావు? నా మాటవిని, హాయిగా ఇంటిపట్టునపడి ఉండు,'' అన్నాడు.

తన ఎత్తు మరి పారదని గ్రహించిన రామయ్య తన కాలికట్టు విప్పి, తల వంచుకుని, రెండు కాళ్ళతోనూ గబగబా నడుచుకుంటూ అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.



# సహజమైన కోరిక

ఒక దేశపు ఆస్థానవిదూషకుడికి లేక లేక, నడి వయసులో ఒక కొడుకు పుట్టాడు. తండ్రి వాణ్ణి పంచప్రాణాలకన్న ఎక్కువగా చూసుకుంటూ, వాడి ఆనందం కోసం ఏదన్నా చేసేవాడు. అతను తన కొడుక్కు రోజూ డబ్బులిచ్చేవాడు. వాటితో ఆ కుర్రాడు తనకు ఏది కొనాలని తోస్తే అది కొనేవాడు.

ఇలాటి పెంపకంతో కుర్రాడు సహజంగా మకురుగా తయారయాడు. తండ్రికి వాడి వేషాలు చూసి కోపంవచ్చి, వాణ్ణి ఒక దెబ్బవేశాడు. కాని మరుక్షణమే ఆ తండ్రి హృదయం దహించుకుపోయింది. ఎన్నడూ కొడుకును పల్లెత్తుమాట అననివాడు ఎంతో దుర్మార్గంగా కొట్టాడు.

తరవాత అతను కొడుకును పదింతలు ముద్దుచేసి బుజ్జగించి, వాడికొక వెండి రూపాయి ఇస్తూ, "నాన్నా, నేను కొట్టినందుకు ఏమన్నా అనుకుంటున్నావా?" అని అడిగాడు రాజీ ధోరణిలో.

అవునన్నట్టు కొడుకు తల ఊపాడు.

"ఏమనుకుంటున్నావు?" అని తండ్రి అడిగాడు.

"నువు నన్ను రోజూ కొడుతూ ఉంటే బాగుండునని!" అన్నాడు ముద్దుల కొడుకు.

—మురికిపూడి ప్రకాశరావు.






విదర్భదేశపు యువరాణి రత్నమంజరి ఒకసారి తన చెలికత్తెలతో వనవిహారానికి పోయి, అక్కడ ఉన్న కొలనులో స్నానం చేసింది. అటు వచ్చినప్పుడల్లా ఆమె ఆ కొలనులో స్నానం చేస్తూ ఉండేది. స్నానం చేసేముందు ఆమె తన నగలన్నీ తీసి ఒక చోట పెట్టింది. జలకాలాడి ఆమె గట్టుమీదికి వచ్చి తన నగలు తిరిగి ధరించేటప్పుడు తన చిటికెనవేలి రవ్వల ఉంగరం పోయినట్టు తెలిసింది.

ఇలా ఇదివరకెన్నడూ జరగలేదు. ఆ ప్రాంతానికి పై వాళ్ళెవరూ రావటానికి వీల్లేదు. యువరాణి స్నానం చేసేదాకా అటు కేసి ఎవరూ రాకుండా చూడటం ఆమె చెలికత్తెల పని. అందుచేత ఉంగరాన్ని దొంగిలించినది చెలికత్తెలలో ఒకతె అయి ఉండాలి. ఈపని చెలికత్తెలందరూ కలిసి చేసి ఉండటం అసంభవం. వాళ్ళందరూ యువరాణి కోసం ప్రాణాలియ్యగల వాళ్ళు. అందరినీ సోదాచేస్తే ఉంగరం దొరికిపోతుంది. కాని ఒకతె చేసిన పాడుపనికి అందరినీ సోదాచేసి, వారి మనసు నొప్పించటం యువరాణికి ఇష్టం లేకపోయింది. ఎవరినీ నొప్పించకుండా దొంగను ఎలా పట్టటం?

నగరంలో ప్రశ్నలు చెప్పేవాళ్ళున్నారు. దొంగతనాలు జరిగితే నష్టపోయినవారు ఈ జ్యోతిష్కులను ప్రశ్నలడిగి దొంగలను పట్టటానికి ప్రయత్నించేవారు. ఈ సంగతి యువరాణి చాలాసార్లు విని ఉన్నది. ఆమెకు ప్రశ్నలు చెప్పే వాళ్ళలో ఏ మాత్రమూ నమ్మకం లేదు, అయినా అలాటి వాణ్ణి తాను ఉపయోగించుకుని దొంగను పట్టవచ్చునని ఆమెకు తోచింది.

అంతఃపుర స్త్రీలు ఒక జ్యోతిష్కుణ్ణి గురించి గొప్పగా చెప్పి, అతన్ని ప్రశ్న

గంగిశెట్టి శివకుమార్

అడిగితే, పోయిన ఉంగరం జాడ తెలియ వచ్చునన్నారు. యువరాణి రహస్యంగా ఆ జ్యోతిష్కుడికి కబురు పెట్టింది. అతను వచ్చాడు.

యువరాణి అతనితో, ''నా చేతి కంకణం ఉదయం నుంచీ కనిపించటం లేదు. దాన్ని ఎవరు తీసి ఉంటారో చెప్ప గలరా?'' అన్నది.

జ్యోతిష్కుడు కొంచెం సేపు ఏదో గుణించి, ''యువరాణీ, ఆ కంకణం ఇప్పటికే చాలా చేతులు మారిపోయింది. ఓ పదిహేను రోజుల్లో దానంతట అదే మీకు అందగలదు,'' అన్నాడు.



''తప్పు! నా కంకణం ఎవరూ ఎత్తుకు పోలేదు. నేను మీతో అబద్ధం చెప్పాను. నా కంకణం నా నగల పెట్టెలోనేవున్నది. నిజంగా పోయినది నా ఉంగరం. దాన్ని తీసినది కూడా నా చెలికత్తెలలో ఒకతె. దొంగలను పట్టేటందుకు మీ శక్తి చాలదు గనక నాయుక్తిని మీద్వారా ఉపయోగపరు స్తాను. నేను చెప్పినట్టు చెయ్యగలరా?" అని యువరాణీ జ్యోతిష్కుణ్ణి అడిగింది.

''చిత్తం! మీరెలా చెబితే అలా చేస్తాను,'' అన్నాడు జ్యోతిష్కుడు.

యువరాణి అతనికి చెప్పవలసినది చెప్పి, అతన్ని రహస్య మార్గాన బయటికి పంపేసింది. తరవాత కొద్ది సేపటికి యువరాణి వద్దకు ఒక దాసీవచ్చి, ''తమ కోసం ఎవరో జ్యోతిష్కుడు వచ్చాడు,'' అని చెప్పింది.

యువరాణి తన చెలికత్తె లందరినీ పిలిపించి, ''పోయిన నా ఉంగరం గురించి ప్రశ్న చెప్పటానికి జ్యోతిష్కుడు వచ్చాడట. ఏం చెబుతాడో చూతాం,'' అని, దాసీతో, అతణ్ణి ప్రవేశపెట్టమన్నది.

జ్యోతిష్కుడు యువరాణి సన్నిధికి వచ్చాడు. యువరాణి అతనితో, "అయ్యా, మిమ్మల్ని రెండు కారణాలచేత పిలి పించాను. ఇవాళ ఉదయం నా చేతి కంకణం ఎవరో కాజేశారు. ఆ దొంగను మీరు పట్టుకోవాలి. రెండు రోజులక్రితం

ఇంకొక చిన్న దొంగతనం జరిగింది. నా చిటికెన వేలి ఉంగరం పోయింది. అది ఎవరివద్ద చేరినదీ మీరు చెప్పాలి,'' అన్నది.

''చిత్తం, అలాగే!'' అంటూ జ్యోతిష్కుడు ఏదో గుణించి, ''యువరాణీ, మీ కంకణాన్ని ఎవరూ దొంగిలించలేదు. అది మీ నగలపెట్టెలో భద్రంగా ఉన్నది. మీరే దాన్ని అందులో పెట్టి మరచిపోయి, ఇంకెక్కడో వెతికారు,'' అన్నాడు.

యువరాణి తన చెలికత్తెను పంపి నగల పెట్టెను తెప్పించి, దాన్ని తెరిచి, అందులో నుంచి కంకణం పైకి తీసి, ఆశ్చర్యం అభినయిస్తూ, ''మీ శక్తి చాలా గొప్పది. దయచేసి నా ఉంగరం జాడ కూడా చెప్పండి. దాన్ని తీసినవారు అంతఃపురంలో వారే అయితే, నిశ్చయంగా తల తీయిస్తాను,'' అన్నది.

''దొంగకు అంత కఠినశిక్ష విధిస్తా నంటున్నారు గనక నేను నిజం చెప్పి, ఒకరి ప్రాణం నిలువునా తీయటానికి సంకోచిస్తున్నాను. మీరు కొద్ది శిక్షతో పోనిచ్చే పక్షంలో దొంగ పేరు ఈ క్షణం చెబుతాను,'' అన్నాడు జోతిష్కుడు.

''దొంగ తన తప్పు ఒప్పుకుంటే, ఇదే మొదటి తప్పయితే, మీ తృప్తి కోసం క్షమిస్తాను. కాని మీ నోటి మీదుగా దొంగజాడ తెలిసినాక మరణదండన తప్పదు,'' అన్నది యువరాణి.

ఆమె ఈమాట అన్న మరుక్షణం సునందిని అనే చెలికత్తె యువరాణి కాళ్ళమీద పడి, భోరున ఏడుస్తూ, ''బుద్ధి గడ్డితిని పాడుపని చేశాను. ఆ చిన్న ఉంగరం నా ప్రాణం మీదికి తెస్తుందని కలలో కూడా అనుకోలేదు,'' అన్నది.

''శిక్ష ఉంగరం విలవను బట్టికాదు, నమ్మక ద్రోహానికి. ఉంగరం కావలిస్తే నన్ను అడగరాదా? ఏదో అవకాశం చూసి ఇయ్యకపోయానా? ఇక ఎన్నడూ ఇలాటి పనులు చెయ్యకు,'' అని యువరాణి సునందినిని క్షమించి, జ్యోతిష్కుడికి బహుమానం ఇచ్చి పంపేసింది.





# చీనా రాజకుమారి పెళ్లి

చాలాకాలం క్రితం చీనాలోని ఒక రాష్ట్రానికి ఒక రాజు ఉండేవాడు. అతనికి ఒక మనమరాలు తప్ప మరెలాటి బంధువులూ లేరు. రాజు మనమరాలు స్యుచి మూడేళ్ళ పిల్ల అయి ఉండగా ఆమె తల్లిదండ్రులు ఇద్దరూ పోయారు. ఆమెను రాజు ఎంతో ప్రేమతో పెంచి పెద్ద చేశాడు.

స్యుచి గొప్ప సౌందర్యవతి మాత్రమే గాక, అన్ని విద్యలలోనూ ఆరితేరింది. సింహాసనానికి ఆమె వారసురాలు. ఆమెకు పదహారేళ్ళు నిండగానే రాజు ఆమెకు వివాహం చేయ తలపెట్టాడు. ఆమెకు తగిన వరుణ్ణి వెతకటానికి వార్తాహరులు అన్ని వైపులకూ బయలుదేరారు. ఆమెతోబాటు రాజ్యాన్ని కూడా చేజిక్కించుకోవాలని దేశంలోనే అనేకమంది యువకులు ఆరాటపడ్డారు.

యువకులకు కఠినమైన పరీక్షలు పెట్టి, స్యుచిని పెళ్ళాడటానికీ, తన అనంతరం రాజు కావటానికీ తగినవాణ్ణి నిర్ణయించాలని రాజు అభిప్రాయం. రాష్ట్రంలోని వాళ్ళూ, ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన వాళ్ళూ, అందరూ చేరి పాతికమంది దాకా అయారు.

అయితే స్యుచి అదివరకే ఒక యువకుణ్ణి వరించి ఉన్నది. అతను ప్రధాన మంత్రి కొడుకు చు వాంగ్. అతను అందగాడూ, విద్యాధికుడూ, రాజనీతికోవిదుడూనూ. వాళ్ళిద్దరూ చిన్నతనం నుంచీ కలిసి ఆడుకున్నారు. వారిద్దరికీ పెళ్ళి జరిగితే ఎంతో బాగుంటుందని అంటూ అనుకున్నారు. కాని రాజుకు మాత్రం తాను నిర్ణయించిన పరీక్షలలో నెగ్గనివాడికి ఆమెనిచ్చే ఉద్దేశం ఎంతమాత్రమూ లేదు.

ఆయన పెట్టిన పరీక్షలలో మొదటిది రూపురేఖలకూ, దేహదార్ఢ్యానికీ సంబంధించినది. రాజకుమారిని పెళ్ళాడవచ్చిన పాతికమందిలో పదిమంది మాత్రమే ఈ పరీక్షలో నెగ్గారు; మిగిలిన పదిహేను మందీ వచ్చినదారి పట్టారు. నెగ్గినవారిలో చు వాంగ్ ఉన్నాడు.

తరవాత వరసగా యుద్ధవిద్యలలోనూ, ఆటలపోటీలలోనూ, సహనంలోనూ, సమయస్ఫూర్తిలోనూ పరీక్షలు సాగాయి, ఒక్క విలువిద్యలోనే ఆరుగురు ఓడిపోయి, నలుగురు మిగిలారు. అది చాలా కఠినమైన పరీక్ష. రోజులకొద్దీ నడవటమూ, తాళ్ళ సహాయంతో నిటారుగా ఉండే కొండలెక్కటమూ మొదలైన పరీక్షలలో మరొకడు జారిపోయి, చివరకు ముగ్గురు మిగిలారు.

ధైర్యసాహసాలను పరీక్షించటానికి ముగ్గురినీ మూడు గుహలలో ఒంటరిగా ఉంచారు. వాటిలో భూత పిశాచాలుంటాయని ప్రతీతి. మర్నాడు తెల్లవారేసరికి ముగ్గురిలో ఒకడు భయంతో మూర్ఛపోయి ఉన్నాడు. చివరకు అన్ని పరీక్షలలోనూ నెగ్గినవాళ్లు ఇద్దరు తేలారు. వారిలో ఒకడు మంత్రి కొడుకు చు వాంగ్, రెండోవాడు దూర రాష్ట్రపు రాకుమారుడు హువాంగ్ ఖో. ఇద్దరికీ స్యు చిని వివాహమాడే అర్హత ఉన్నది. కాని ఇద్దరూ ఒకతెను పెళ్ళాడలేరు గనక, వారిలో ఎవరు గొప్ప అద్భుతం ప్రదర్శిస్తే వారికి



తన మనమరాలిని ఇచ్చి పెళ్లిచేస్తానన్నాడు రాజు. అతనికి ఈ ఆలోచన చెప్పినవాడు ఆస్థాన ఇంద్రజాలికుడు చుంగ్ చింగ్. అతనికి స్యు చి అన్నా, చు వాంగ్ అన్నా ఎంతో ప్రేమ; వారిద్దరికీ పెళ్ళి కావాలని ఆయన కోరిక కూడానూ.

రాజు పోటీదార్లు ఇద్దరినీ పిలిచి, "మీలో ఎవరు అద్భుతం ప్రదర్శిస్తే వారికి స్యు చిని ఇచ్చి పెళ్ళి చేస్తాను." అన్నాడు.

చు వాంగ్ అదివరకే చుంగ్ చింగ్ వద్ద ఇంద్రజాల విద్యలో ఉత్తీర్ణుడై ఉన్నాడు. కాని హువాంగ్ ఖోకు అలాటి విద్యలేవీ రావు. అతను చిన్న కనుకట్టు విద్య ప్రదర్శించటానికి ప్రయత్నించి, బయటపడి, అందరి ఎదటా నవ్వులపాలు అయ్యాడు.

ఓడిపోయినా హువాంగ్ ఖో ఇంటికి తిరిగి వెళ్లక, చు వాంగ్ మర్నాడు ఏమి అద్భుతం చేస్తాడో చూడటానికి ఉండి పోయాడు.

మర్నాడు స్యు చి రాజసభకు హాజ రయింది. చు వాంగ్ తనతో రెండడుగుల నిడివిగల పట్టుతాడు తెచ్చాడు. అతను ఆ తాడు రెండు చివరలూ స్యు చి రెండు చేతులకూ కట్టాడు. అతను ఆమెను ఒక మురుగు ఇయ్యమని అడిగాడు. ఆమె చేతులకు మురుగులు లేకపోవటం చేత, తన దాసీని పంపి ఒక మురుగు తెప్పించి, అతనికి ఇప్పించింది. తరవాత స్యు చి



చేతుల మీద, మోచేతులదాకా ఒక తువాలు కప్పారు. చు వాంగ్ తన చేతిలో ఉన్న మురుగును ఆస్థాన ఇంద్రజాలి కుడికి ఇచ్చి, దానిని బావిలో పడవెయ్య మన్నాడు. చుంగ్ చింగ్ కొందరిని వెంట పెట్టుకుని వెళ్ళి, మురుగును బావిలో వేసి, తిరిగి వచ్చాడు.

''అయ్యా, తమరు స్యు చి మురుగును బావిలో నిజంగా పడవేశారా?'' అని చు వాంగ్ చుంగ్ చింగ్‌ను అడిగాడు.

ఆయన అవునన్నట్టు తల ఆడించాడు.

''అది ఎలాసాధ్యం? నేను నిజంగా స్యు చిని పెళ్లాడాలని విధినిర్ణయించి ఉన్న పక్షంలో ఆమె మురుగు ఆమె చేతికే ఉంటుంది. దయచేసి రాజుగారు ఆమె చేతుల మీది తువాలా తీస్తారా?'' అన్నాడు చు వాంగ్.

తువాలు తీసేసరికి స్యు చి మణికట్టు లకు బంధించిన పట్టుతాడుకు మురుగు వేళ్ళాడుతూ కనిపించింది. ఇది చూసి అందరూ అద్భుతం చెందారు. హువాంగ్ ఖో ముందుకు వచ్చి, చు వాంగ్‌ను మన స్ఫూర్తిగా అభినందించాడు.

రాజుగారి మనమరాలికీ, మంత్రి కొడుక్కూ వైభవంగా వివాహం జరిగింది.

చు వాంగ్ చేసిన అద్భుతంలో రహస్యం ఏమంటే, అతనూ, స్యు చీ, చుంగ్ చింగ్ - ముగ్గురూ కలిసి ఆడిన నాటకం. స్యు చి ఒక మురుగుల జత నుంచి ఒకటి తన మోచేతికి సమీపంలో ధరించి, దాని మీదుగా నిండుచేతుల చొక్కా తొడుక్కున్నది. ఆ జతలో రెండవ దాన్ని ఆమె తన పరిచారిక చేత తెప్పించింది. తన రెండు చేతులకూ పట్టుతాడు కట్టి, చేతులమీద తువాలు కప్పినప్పుడు ఆమె తన చేతికి ఎగువన ఉన్న మురుగును కిందికి జారనిచ్చి, పట్టుతాడు మీదికి తెప్పించింది.

ఇదే మంత్రికొడుకు ప్రదర్శించిన మహత్తు. వివాహం అయినాక స్యు చి ఆస్థాన ఇంద్రజాలికుడైన చుంగ్ చింగ్‌ను ఘనంగా సత్కరించింది.



# నిజాయితీ

పద్మపురిరాజ్యాన్ని అగ్నిపర్ణుడు పాలించేవాడు. రాజ్యం సుభిక్షంగా ఉండేది. కోశాగారం నిండుగా ఉండేది. అయితే కోశాధికారులను రాజు వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండి, వాళ్ళు ద్రోహం చేసినప్పుడల్లా శిక్షించి, కొత్తవాళ్ళను వేసుకునేవాడు.

మల్లికార్జునుడు అనే కొత్త కోశాధికారి నియమించబడ్డాడు. రాజు మామూలు పౌరుడి వేషం వేసుకుని, చీకటిపడి మల్లికార్జునుణ్ణి చూడబోయి, "తమ కోసం వచ్చాను," అన్నాడు.

దీపం పెట్టుకుని లెక్కలు చూస్తున్న కోశాధికారి, "ఒక్కక్షణం ఆగండి. ఈ పని పూర్తికానియ్యండి," అని, లెక్కలు చూడటం పూర్తిచేసి, దీపం ఆర్పేసి, ఇంకో దీపం వెలిగించి, "చెప్పండి, నాతో ఏం పని?" అని అడిగాడు.

రాజు ఆశ్చర్యపోతూ, "ఆ దీపం ఆర్పి, ఈ దీపం వెలిగించారెందుకు?" అని అడిగాడు.

"కోశాగారం పనికి కోశాగారం దీపం వాడాను. నా పనికి నా సొంత దీపం వెలిగించాను," అన్నాడు మల్లికార్జునుడు.

తనకు నిజాయితీ గల కోశాధికారి దొరికినందుకు రాజు చాలా సంతోషించాడు.

—ఇ. ఎస్. పద్మ.






మహేంద్రపురి రాజు సమర్థుడైన రాజే గాని, అతని రాజ్యంలో ఆకస్మికంగా దొంగతనాలు ఆరంభమయాయి. దొంగలు ఒకంతట దొరకలేదు. దొంగల స్థావరం అరణ్యంలో ఉన్నట్టు కనబడింది. ఎందుకంటే, అరణ్యమార్గంగా వచ్చే ప్రయాణీకులు దోచుకోబడ్డారు.

రాజు పదిమంది భటులను అరణ్యంలోకి పంపాడు. మూడో రోజున వాళ్ళు బోడితలలతో తిరిగి వచ్చారు. అయితే వాళ్ళు సాధించినదేమంటే, దొంగల నాయకుడి పేరు తెలుసుకోగలిగారు.

తరవాత దొంగలను పట్టుకుంటానని మంత్రి కొడుకు బయలుదేరి వెళ్ళాడు. మూడో రోజున అతను తిరిగి వచ్చేసరికి, అతని చేతికి గాజులూ, ఒంటికి చీరా, రవికా, ఆడవేషమూ ఉన్నాయి. అతను సాధించినదేమంటే, దొంగల నాయకుడి ఇల్లు ఉండే అరణ్య ప్రాంతం తెలుసుకున్నాడు.

తరవాత దొంగలను పట్టటానికి రాజు సేనాపతిని పంపాడు. అతను తిరిగి వచ్చేసరికి ఒక గాడిద మీద కట్టబడి, శరీరమంతా రంగునీళ్ళు చల్లబడి ఉన్నాడు. అతను సాధించినదేమంటే, దొంగలనాయకుడి ఇంటి తలవాకిలి చూశాడు.

ఈసారి రాజు దొంగలను పట్టటానికి తానే పూనుకుని, కట్టెలు కొట్టేవాడి వేషంలో అడవికి వెళ్ళాడు. లోగడవెళ్ళి, దొంగలచేత పరాభవం పొందివచ్చిన వాళ్ళు సేకరించిన వివరాల సహాయంతో అతను దొంగలనాయకుడి ఇంట ప్రవేశించాడు.

ఆ సమయానికి దొంగలనాయకుడు మహేంద్రుడు దొంగతనాల కోసం వెళ్లి

ఆర్. అచ్యుతరావు

ఉన్నాడు. మహేంద్రుడి కొడుకు నిద్ర పోతున్నాడు. రాజు మహేంద్రుడి భార్యకు మత్తుమందు వాసన చూపించి, స్పృహ పోగొట్టి, ఆమె కొడుకును ఎత్తుకుని రాజ భవనానికి తిరిగి వచ్చి, దొంగలనాయకుడు తన బిడ్డకోసం వస్తే పట్టుకోవటానికి తగిన ఏర్పాట్లు చేశాడు.

దొంగలనాయకుడు తన బిడ్డకోసం ఎంతో శ్రద్ధగా ఆరాలు తీసి, వాడు రాజ భవనంలో ఉన్నట్టు తెలుసుకుని, ముసలి సన్యాసి వేషం వేసుకుని, రాజదర్శనం కోరి వచ్చాడు.

రాజు సన్యాసికి స్వాగతం పలికాడు గాని, విచారంలో ఉన్నట్టు కనిపించాడు. సన్యాసి రాజు విచారానికి కారణం అడిగాడు. రాజు సన్యాసిని లోపలికి తీసుకుపోయి, రెండు తొట్టెలలో ఉన్న ఇద్దరు బిడ్డలను చూపించాడు. ఇద్దరూ తీవ్రమైన విషజ్వరంతో ఒళ్ళుతెలియని స్థితిలో ఉన్నారు.

ఆ ఇద్దరు బిడ్డలలో ఒకడు తన కొడుకేనని దొంగకు తెలిసిపోయింది.

"ఈ బిడ్డ లిద్దరూ ఒక తల్లి బిడ్డలుగా లేరే? వారికేమయింది?" అని దొంగ రాజును అడిగాడు.

రాజు తాను మహేంద్రుడి బిడ్డను ఎత్తుకు వచ్చిన సంగతి చెప్పి, "నేను ఈ బిడ్డను ఎత్తుకువచ్చిన అనంతరం దొంగతనాలు నిలిచిపోయాయేగాని, దొంగ తన బిడ్డకోసం ఇటుగా రాలేదు. ఇంతలో



నా బిడ్డకూ, మహేంద్రుడి బిడ్డకూ ఒకే విధమైన విషజ్వరం వచ్చింది. వైద్యులు ఈ జ్వరానికి కావలసిన మూలిక కోసం తెగవెతుకుతున్నారు," అన్నాడు.

ఇంతలో ఒక వైద్యుడు ఔషధంతో గబగబా వచ్చి, "మహారాజా, మూలిక ప్రస్తుతం కొద్దిగా దొరికింది. ఒక బిడ్డకు చాలిన ఔషధం తయారయింది. దీన్ని రాజకుమారుడికి ఉపయోగిస్తాం," అన్నాడు.

రాజు వెంటనే, "అలాకాదు, ముందు రెండో బిడ్డకు చికిత్స చెయ్యండి. మరి కొంత దొరికినాక రాజకుమారుడికి చికిత్స చేయవచ్చు," అన్నాడు.

వైద్యుడు ఆశ్చర్యపడుతూ, రాజు చెప్పినట్టే చేశాడు.

ఇదంతా చూస్తున్న మహేంద్రుడు, "ఇదేమిటి, రాజా? నీ బిడ్డకన్న దొంగ వాడి బిడ్డ ఎక్కువా? ప్రజాకంటకుడి బిడ్డను బ్రతికించటం ఎలా ముఖ్యం?" అని అడిగాడు.

"ఈ బిడ్డ ప్రజాకంటకుడు కాదు, నిరపరాధి. నేనా బిడ్డను దొంగతనంగా తెచ్చాను. దొంగ దొరికిన అనంతరం నేనీ బిడ్డను వీడి తల్లికి భద్రంగా తిరిగి అప్పగించితేనే నాకు దొంగను విచారించే అర్హత ఉంటుంది. అదృష్టం ఉంటే నా కొడుకు ఆరోగ్యం అదే బాగవుతుంది," అన్నాడు రాజు.

"నేనే గజదొంగ మహేంద్రుణ్ణి, ఎంతోకాలంగా దారిదోపిళ్ళు చేస్తున్న మహా పాపిని!" అంటూ దొంగ రాజు కాళ్ళమీద పడ్డాడు.

ఈ లోపల ఇంకో ప్రాంతంలో దొరికిన మరికొంత మూలికతో రాజు కొడుక్కు కూడా చికిత్స జరిగింది. ఇద్దరు బిడ్డలూ తిరిగి ఆరోగ్యం పొందారు.

మహేంద్రుడు తన అనుచరులందరితోనూ, తాను కొల్లగొట్టిన ధనరాసులతోనూ వచ్చి, రాజుకు లొంగిపోయాడు. వారందరికీ రాజు బ్రతుకు తెరువు చూపించాడు.






# స్నేహం కాని స్నేహం

ఒక ఊళ్ళో సోమయ్యా, కామయ్యా అని ఇద్దరు రైతులు పరిస్థితులను బట్టి స్నేహితులలాగా మసలుతూ ఉండేవారు. వారి ఇళ్ళూ, పొలాలూ కూడా పక్క పక్కనే ఉండేవి; పనికి ఇద్దరూ కలిసి వెళ్ళి, మళ్ళీ ఇళ్ళకు కలిసి వచ్చేవారు. ఇలా జంటగా జీవించటమే వారిని స్నేహితులలాగా కనబడేటట్టు చేసేది. నిజానికి వారి మనస్తత్వాలలో ఐకమత్యం లేదు. ఇద్దరూ జిత్తులూ, ఎత్తులూ ఎరిగిన వారే! ఒకరి నొకరు తమ స్వార్థానికిగాను మోసగించుకునేవారు. ఇద్దరూ ఒకే పంట వేసి, ఒకరిని మించి ఒకరు పండించటానికి పోటీ పడేవారు.

సోమయ్య పొలం కన్న కామయ్య పొలం కాస్త పల్లంగా ఉండటం చేత, సోమయ్య పొలానికి పెట్టిన నీరు కామయ్య పొలానికి అందుతూండేది. ముఖ్యంగా నీటి ఎద్దడి వచ్చినప్పుడు కామయ్య పొలానికి కావలసిన నీరు కూడా తన పొలంనుంచే సోమయ్య అందించటం జరిగేది. ఇద్దరి మధ్యా మాటామాటా వచ్చేది. కాని సోమయ్య ఏమీ చెయ్యలేక పోయేవాడు. రెండు పొలాలమధ్య ఉండే గట్టును సోమయ్య ఎంత కట్టుదిట్టం చేసినా, ఏ ఎలుక కన్నంనుంచో నీరు కామయ్య పొలానికి చేరనే చేరేది. గత్యం తరంలేక సోమయ్య ఏతం తోడుతూంటే కామయ్య ముసి ముసి నవ్వులు నవ్వుకునేవాడు.

క్రమంగా ఇద్దరి మధ్యా మాటలు తగ్గాయి. ఎవరిపని వారు మౌనంగా చేసుకునేవారు.

ఒకసారి ఇద్దరూ మొక్కజొన్న వేశారు. పంట చేతికి వచ్చేసమయంలో ఇద్దరూ తమ పొలాలలో మంచెలు

బూర్లె నాగేశ్వరరావు



వేసుకుని కాపలా కాయసాగారు. చలి రోజులు. ఒక రాత్రి మరీ చలిగా ఉన్నది. తన పొలానికి కూడా కామయ్యే కాపలా కాసేటట్టు చెయ్యాలని సోమయ్యకు అని పించింది. వెంటనే అతను గడ్డితో ఒక మనిషిబొమ్మ చేసి, దానికి తన చొక్కా, ధోవతీ కట్టి, మంచె మీద నిలబెట్టి, కంబలి కప్పుకుని తిన్నగా ఇంటికి వెళ్ళి పడుకున్నాడు.

ఇలా రోజూ అతను రాత్రి అంతా తన మంచె మీద బొమ్మను నిలబెట్టి, తెల్ల వారుఝామున దాన్ని దించేవాడు. అది బొమ్మ అని తెలియక, సోమయ్యతో పోటీ పడుతున్నాననుకుని, కామయ్య తెల్ల వార్లూ మేలుకుని, రెండు పొలాలకూ కాపలా కాస్తూ వచ్చాడు.

కొద్ది రోజులు గడిచినాక, కామయ్య పెళ్ళాం, సోమయ్య రాత్రిళ్లు ఇంట్లో పడు కుంటున్న సంగతి పసిగట్టి, "సోమయ్య వెచ్చగా ఇంట్లో పడుకుంటున్నాడు. ఈ పొలం కాపలాపని నీకే పట్టినట్టున్నది," అన్నది.

కామయ్య తన పెళ్ళాం మాట నమ్మక, "కలగంటున్నావా ఏం? తెల్లవార్లూ నేనూ, సోమయ్యా ఒకరి నొకరు చూసుకుంటూ కాపలా కాస్తున్నాం. వాడి మీద పోటీపడే నేను అసలు ఇంటికి రావటం లేదు," అన్నాడు.

కాని కామయ్యకు ఒక ఆలోచన తట్టింది. సోమయ్య ఎలాగూ తెల్లవార్లూ నిలబడి కాపలా కాస్తూనే ఉన్నాడు గనక, తాను సోమయ్యకు తెలియకుండా ఇంటికి పోయి పడుకుంటే నేం?

ఇలా అనుకుని కామయ్య పిల్లిలాగా మంచె దిగి ఒక రాత్రి ఇంటికి వచ్చేశాడు. అయితే అతనికి సోమయ్య ఇంట్లో నుంచి మగగొంతు నవ్వటం వినిపించింది.

"అది సోమయ్య గొంతే! అతగాడు ప్రతిరోజూ ఇంట్లోనే ఉంటున్నాడని నేను చెబితే నువ్వు నమ్మలేదు. ఇప్పుడైనా తెలిసిందా?" అన్నది కామయ్య భార్య.

"నీ మొహం! సోమయ్య మంచె మీద నిలిచి ఉండటం నేను వచ్చేటప్పుడు కళ్ళారా చూశాను. ఉండు, వాణ్ణి పిలుచుకు వచ్చి, ఈ వ్యవహారం అంతు తేలుస్తాను," అంటూ కామయ్య పొలానికి పరిగెత్తుకుపోయి, "ఒరే, సోమయ్యా! ఒక్కసారి ఇంటికి పోయి, నీ ఇంట్లో ఏం జరుగుతున్నదో చూడు!" అని కేక పెట్టాడు.

మంచె మీది గడ్డిబొమ్మ కదలలేదు. కామయ్య మంచె ఎక్కి, గడ్డి బొమ్మను చూసినాక, తనను సోమయ్య ఇన్నాళ్ళూ ఎలా ఉపయోగించుకుంటున్నదీ తెలిసి పోయింది. కామయ్యకు ఏడుపు వచ్చింది. తన భార్య నిజం చెప్పినా తాను తెలుసుకో లేదు. ఇప్పుడు ఒకటే మార్గం. ఇన్నాళ్లూ సోమయ్య చేసిన పని, తాను అంతకు ముందు నుంచే చేస్తున్నట్టు సోమయ్యను నమ్మించాలి!

కామయ్య తాను కూడా ఒక గడ్డి బొమ్మను తయారుచేసి, దానికి బట్టలు తొడిగి, తన మంచె మీద నిలబెట్టి, ఇంటికి వెళ్లి పడుకున్నాడు. సోమయ్యలాగే తాను కూడా తెల్లవారే ముందు పొలానికి వెళ్లి, బొమ్మను దించేసేవాడు.

పంట కోతకు వచ్చేదాకా రెండు పొలాలకూ గడ్డి బొమ్మలే కాపలా కాశాయి. ఒక రోజు అర్ధరాత్రివేళ దొంగలు వచ్చి, రెండు మంచెల మీదా కాపలావాళ్లున్నట్టు భ్రమపడి, వాళ్లు ఎప్పుడు నడుం వాల్చితే



అప్పుడు పంట దోచుకుందామని, నక్కి కూర్చున్నారు. కోళ్లు కూసే వేళ సోమయ్యా, కామయ్యా వచ్చి, మంచెల మీద ఎక్కి, బొమ్మలను దించి, వాటి స్థానంలో తాము నిలబడటం దొంగల కంటపడింది.

అసలు సంగతి తెలిసింది గనక, మర్నాడు రాత్రి దొంగలు వచ్చి, రెండు పొలాల పంటా నిశ్చింతగా కోసుకుని, పోతూపోతూ కామయ్య మంచె మీది బొమ్మను తెచ్చి, సోమయ్య మంచె మీద ఉన్న బొమ్మకు ఎదురుగా పెట్టి, రెండు బొమ్మల తలలలోనూ కర్రబెండ్లు దూర్చి, వాటికి నిప్పు అంటించి వెళ్ళిపోయారు.

మరి కొంతసేపటికి కామయ్య వస్తూనే తన బొమ్మ సోమయ్య మంచె మీద ఉండటమూ, రెండు బొమ్మలూ చుట్టలు కాల్చుకుంటూ మాట్లాడుతున్నట్టు ఉండటమూ చూసి, దడుచుకుని ఇంటి కేసి పరిగెత్తసాగాడు. అతనికి దారిలో సోమయ్య ఎదురై, "ఏమయింది, కామయ్యా? దొంగలు పడ్డారా?" అని అడిగాడు.

కామయ్య తాను చేసిన మోసం చెప్పేసి, రెండు బొమ్మలూ మాట్లాడుతూ మంచె మీద కనిపించిన మాట బయట పెట్టాడు. ఇద్దరూ అయోమయంలో పడి, పొలానికి వచ్చి కళ్లారా చూసి, అదేదో దయ్యాలపనే అనుకున్నారు. వాళ్ళు చూస్తూండగానే రెండు బొమ్మలూ ఒక్కసారిగా తగల బడసాగాయి.

సోమయ్య, కామయ్య లిద్దరూ ఒకరి నొకరు వాటేసుకుని బావురుమన్నారు. మరి కొంచెం సేపటికి తెల్లవారింది. పంటంతా దొంగల పాలైనట్టు తెలిసింది.

"మన అతితెలివికి తగిన శాస్తి జరిగింది," అన్నాడు సోమయ్య.

"ఇక ఎన్నడూ మనం ఒకరి నొకరు మోసం చేసుకోవద్దు," అన్నాడు కామయ్య.

ఇద్దరిమధ్యా నిజమైన స్నేహమే ఉంటే రెండు పొలాలకూ రోజు విడిచి రోజు ఒకరు కాపలాకాసి, రెండోవాళ్ళు ఇంట్లో హాయిగా పడుకునే పని! పంట కూడా పరాయివాళ్ళ పాలుకాకపోను!





రామరాజ్యంలో న్యాయంకోసం ఎక్కువ, తక్కువ మొదలైన తేడాలు లేకుండా నిరాటంకంగా వెళ్లి రాజుతో చెప్పుకొని న్యాయం పొందవచ్చు. ఒకనాటి రాత్రి ఒక కుక్క రక్తం ఓడుతూ కొనప్రాణంతో వెళ్ళి రాముడు ఉండే సౌధంముందు నిల్చి పిలుస్తున్నట్లుగా మొరిగింది.

రాముడు మేల్కొని వచ్చి కుక్క తల నిమిరాడు. దాని బాధ అంతా మాయమై ఉత్తేజం వచ్చి, ''ఓ, రామా! ఒక యువకుడు నన్ను అన్యాయంగా చావగొట్టాడు. వాడికి ఉద్యోగం సద్యోగం లేక చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నాడు. వాడినో పెద్ద దేవస్థానం ధర్మకర్తగా చేయవలసిందిగా కోరుతున్నాను,'' అన్నది.

రాముడు ఆశ్చర్యంతో, ''మరణ దండనో, కఠినశిక్షనో విధించమని కోరకుండా అపకారికి ఉపకారం కోరుతున్నావా?'' అని అడిగాడు.

''ఇందులో అదేమీలేదు. క్రిందటి జన్మలో నేనొక పెద్ద దేవస్థానం ధర్మాధికారిగా, ప్రధాన పూజారిగా ఉండి దేవాదాయాన్ని కాజేసి, చేయని అకార్యమంటూ లేకుండాచేసి కుక్కగా పుట్టాను. ఆ యువకుడు కుక్కగా పుట్టి నాలాగే అగచాట్లు పడాలి, నా కసి తీరాలి, అనుకున్నాను. కాని పతితపావనమైన నీ స్పర్శవల్ల నా కసి పోయింది; నేను ఉత్తమగతులు పొందబోతున్నాను,'' అని చెప్పి కుక్క ప్రాణాలు విడిచింది. తరవాత



"రామా! నువ్వు మహావిష్ణువువి. నీవు అవతరించిన పని పూర్తి అయింది. సీత లక్ష్మిగా, పుట్టినిల్లు క్షీరసాగరంలో నీ కోసం నిరీక్షిస్తున్నది. ఆదిశేషుడు, శంఖచక్రాలైన నీ తమ్ములతో నీవు క్షీరసాగరం చేరుకోవాలి!'' అని చెప్పాడు.

అదేసమయంలో దూర్వాసుడు హుటాహుటిగా వచ్చి లక్ష్మణుడితో, "నేను ఇప్పుడే రాముణ్ణి చూడాలి! లేకుంటే రఘువంశం నశించేలాగ శపిస్తాను!" అని చెప్పాడు.

వంశనాశనానికి బదులు తాను శిరశ్ఛేదం పొందటమే మంచిదని లక్ష్మణుడు తలంచి, దూర్వాసుడి రాకను రాముడితో చెప్పడానికి లోపలికి వెళ్లాడు. వెంటనే యముడు అంతర్ధానమయ్యాడు.

రాముడు తాను మాట యిచ్చిన ప్రకారం లక్ష్మణుడికి శిరశ్ఛేదం విధించాడు. పెద్దలు ఆలోచించి దేశబహిష్కరణ శిరశ్ఛేదంతో సమానమే గనక, లక్ష్మణుడిని దేశం నుండి వెళ్ళగొట్టి పంపితే చాలునని రాముడికి చెప్పారు. లక్ష్మణుడు అంతా విని, సరయూనదిలో పడి తన అవతారం చాలించాడు.

లక్ష్మణుడు సరయూనదిలో మునిగిన తర్వాత రాముడు భరతశత్రుఘ్నులకు విషయమంతా చెప్పి, పట్టాభిషేకానికి

ఆ యువకుడు అంతా తెలుసుకొని, పశ్చాత్తప్తుడై ఉత్తముడిగా మారాడు.

* * *

అశ్వమేధయాగం చేసి రాముడు కొద్ది కాలం రాజ్యపాలన చేశాక, ఒక నాడు యముడు బ్రాహ్మణరూపంతో వచ్చి, "రామా! నీతో రహస్యంగా మాట్లాడాలి. మనం మాట్లాడుకుంటూండగా ఎవరు వచ్చినా శిరశ్ఛేదం చేయాలి!'' అని చెప్పాడు.

రాముడు అందుకు సమ్మతించి లక్ష్మణుడికి ఆ సంగతి చెప్పి, ద్వారం దగ్గిర కాపు ఉంచి, యముడితో రహస్య మందిరంలోకి వెళ్ళాడు.

చేయవలసిన ఏర్పాట్లన్నీ చూడమని చెప్పాడు. అయోధ్యానగరం అంతా దివ్యంగా అలంకరింపబడింది.

రాముడు లవకుశులకు రాజ్యపట్టాభిషేకం చేసి, హనుమంతుడిని పిలిచి, "హనుమంతా! నేను చాలాకాలం రాజ్యపాలనచేసి విశ్రాంతి కోరుకుంటున్నాను. నేను ఉంటాను, లేకపోతాను. నీవు కుశలవులకు పెద్ద దిక్కుగా ఉండి అన్నీ చూసుకుంటూ ఉండు! రాజ్యరక్షణ భారం నీ మీద పూర్తిగా ఉంచుతున్నాను. వీరినే నన్నుగా చూసుకో. అందనిల్నీ ఉత్తమ పాలకులుగా తీర్చిదిద్దు!" అని చెప్పాడు.

రాముడు సరయూనదికి వెళ్ళడానికి పెద్ద ఊరేగింపు ఏర్పాటు చేయించాడు. ఆ రోజు మహోదయపర్వదినం. మంగళధ్వనులు మారుమోగుతున్నాయి. బ్రాహ్మణులు వేదఘోషచేస్తున్నారు. తూర్యనాదాలు మిన్నుముట్టుతున్నాయి. రాముడు సరయూనదికి పాదచారిగా బయలుదేరాడు. భరతుడు అతనికి తెల్లగొడుగు పట్టాడు. శత్రుఘ్నుడు వింజామరం వీస్తున్నాడు. మేడల మీది నుంచి పుణ్యాంగనలు పూలజల్లు కురిపిస్తున్నారు. హనుమంతుడు రాముడి వెనక మందంగా మతిపోయినవాడిలాగ అడుగులు వేస్తు



న్నాడు. రాముడు సరయూనదికి ఎందుకు వెళ్తున్నాడో తెలియని ప్రజలు పరిపరి విధాలుగా చెప్పుకుంటూ అనుసరిస్తున్నారు. ఊరేగింపు సరయూనది ఒడ్డు చేరింది.

రాముడు సరయూనది నీళ్ళలో పాదాలు మోపాడు. భరతుడు శంఖాన్ని పూరించాడు. శత్రుఘ్నుడు కర్పూరహారతి వెలిగించి, చక్రంగా తిప్పాడు. బ్రాహ్మణులు సామవేదం గొంతెత్తి చదువుతున్నారు. మంగళవాద్యాలతో దిక్కులు పిక్కటిల్లుతూన్నవి. భరతశత్రుఘ్నులు కూడ నదిలోకి దిగి రాముడి భుజాల వెనుక ఇరుపక్కలా నిలబడ్డారు.



రాముడు మెల్లగా నదిలో నడుస్తూ, లోతుకు వెళ్ళి నిల్చుని కుడిచేయి ఎత్తి, అరచేత్తో అభయముద్రపట్టి ప్రజలను ఆశీర్వదిస్తూ, "సంతోషంగా ఇళ్ళకు వెళ్ళండి. సుఖసంతోషాలతో వర్ధిల్లండి!", అని అన్నాడు.

లవకుశుల దగ్గిర నిల్చున్న హనుమంతుడు విలవిల్లాడిపోతూ, "రామా! ఆగు! నీ కంటే ముందు నేనే నదిలో తనువు చాలిస్తాను. నువ్వు లేకుండా నేనెందుకు?" అని గుండెబాదుకొంటూ నదిలో దిగబోతూంటే, రాముడు ముక్కు మీద వేలు పెట్టి వారిస్తూ, "హనుమా, నువ్వు చిరంజీవివి! నేను చెప్పిందంతా మరిచావా? లవకుశులను తోడ్కొని త్వరగా ఇక్కడి నుంచి కదులు!" అని గట్టిగా ఆజ్ఞాపించాడు.

హనుమంతుడు లవకుశులతో రాజమందిరానికి వెళ్ళాడు.

రాముడు సరయూనది లోతుల్లోకి వెళ్ళి, కనిపించలేదు. రాముడి వెనుకనే భరత శత్రుఘ్నులు నదిలో కలిసిపోయారు. రామావతారం ముగిసింది.

క్షీరసాగరంలో లక్ష్మణుడు ముందుగానే ఆదిశేషుడై పాన్పుగా అమరి ఉన్నాడు. రసాతలం నుంచి సీత లక్ష్మిగా వచ్చి కూర్చొని ఎదురుచూస్తున్నది. రాముడు విష్ణువుగా శేషతల్పం మీదకు చేరుకున్నాడు. భరతశత్రుఘ్నులు శంఖ చక్రాలుగా అతని చేతుల్లో ఉన్నారు. లక్ష్మి విష్ణువు పాదాలు ఒత్తసాగింది.

* * *

ఒకనాడు కుశలవులు సింహాసనం మీద కూర్చొని తల్లిని, తండ్రిని తలచుకొని వెక్కి వెక్కి కన్నీరు కారుస్తూండగా, హనుమంతుడు చూసి, వారిని ఓదార్చుతూ, "రఘువంశ దీపకులైన మీరు గొప్పగా రాజ్యపాలన చేయాలిగాని దిగులు పడవచ్చా? మీకు చూడాలనిపించినప్పుడల్లా సీతా రాములను నేను చూపిస్తాను. వారు నా గుండెలో ఎంత ఆనందంగా

ఉన్నారో చూడండి!'' అంటూ తన రొమ్ము చీల్చి చూపించాడు. అందులో చిరునవ్వుతో ప్రేమతో చూస్తూ ఆశీర్వదిస్తున్న తమ తలిదండ్రులను చూసి, కుశలవులు ఎంతగానో సంతోషించారు.

కుశలవులు యువకులై చక్కగా రాజ్యపాలన నిర్వహిస్తున్నారు. తూర్పున మణిపురాన్నీ, పడమట మధురానగరాన్నీ ఉపరాజధానులుగా చేసి, శుభతో కుశుడు మణిపురంలోనూ, శోభతో లవుడు మధురలోనూ ఉంటూ, రెండు వైపులా శాంతిభద్రతలు చూసుకొంటున్నారు.

అంతలో దేశానికి గొప్ప ఆపద ముంచుకొచ్చింది. రాక్షసుడి కంటే క్రూరాతి క్రూరుడైన ఘోరకలి అనే నరరూప రాక్షసుడు శకులు, కుషాణులు, పాషాణులు అనే కొండజాతి దుండగులను కూడగట్టుకొని దండయాత్ర చేస్తూ, వాయవ్యదిశ నుంచి విరుచుకుపడ్డాడు. వాడి సేనలైన దుండగులు పశ్చిమోత్తర రాజ్యభాగం మీదపడి అల్లకల్లోలంచేశారు.

ఘోరకలికి తోడు పడమటి దిక్కున కాలకలి అనే మరొక నరరూప రాక్షసుడు పెద్ద నౌకాబలంతో, కాలకేయులనే సముద్రరాక్షస సేనలతో సముద్రం నుంచి విజృంభించాడు. కాలకలి ఆజ్ఞలప్రకారం కాలకేయులు రాజ్యాలను కొల్లగొడుతూ



అంతులేని ధనధాన్యాలను వాళ్ళ స్థావరమైన కాలకూటద్వీపానికి చేరుస్తూంటారు.

ప్రజలు భీతితో తల్లడిల్లిపోతూ, ఎవరి ధనప్రాణాలను వారు రక్షించుకోడానికి దార్లు వెతుక్కోసాగారు. అప్పుడు హనుమంతుడు ప్రజలమధ్యకు వచ్చి, ఎవరి ఆత్మరక్షణ వారు చూసుకోవడం సరికాదనీ, అందరూ ఏకమై దేశరక్షణ చేసుకోవాలనీ ఉత్తేజపరిచి, రామసేన అనేపేరుతో ప్రజల్ని సైనికులుగా తయారు చేసి నడిపించాడు.

రాముడు పాలించిన రామరాజ్యంలో దేశమంతా రామసేనగా ఉంటే సాధించలేనిదంటూ ఉండదనీ, ఎటువంటి



ఉపద్రవాల భయమూ ఉండదనీ నచ్చ జెప్పి, దుండగులను ఎదుర్కొన డానికి పురిగొలిపాడు. దేశప్రజలందరూ యోధులుగా హనుమంతుడి నాయకత్వంలో ఘోరకలితోను, కాలకలితోను యుద్ధానికి తలపడ్డారు. అప్పుడు హనుమంతుడు రెండు యుద్ధరంగాల్లోనూ వెయ్యి రూపాలతో, ఎక్కడచూచినా హనుమంతుళ్లుగా కనిపిస్తూ, సహస్రరూపాంజనేయుడని అనిపించుకున్నాడు.

కుశుడు గొప్పగా యుద్ధంచేసి, ఘోరకలిని ఆగ్నేయాస్త్రంతో చంపాడు. రామసేన వాడిసేనల్ని తరిమి కొట్టింది. దుండగుల్ని హతమార్చారు.

లవుడు కాలకలితో ఘోరయుద్ధంచేసి, వాడిని వారుణాస్త్రంతో హతమార్చాడు. రామసేన ప్రజలు కాలకేయ రాక్షసులను దొరికినమట్టుకు మట్టుపెట్టారు. హనుమంతుడు తనవాలంతో నౌకలను చుట్టబెట్టి సముద్రంలో ముంచివేశాడు. నౌకలతోబాటు కాలకేయులు చచ్చారు.

రెండు ఘనవిజయాలు సాధించిన ప్రజలతో హనుమంతుడు, "రాముడేలిన భూమిలో ప్రతి పౌరుడూ లవకుశులకు సోదరుడనీ, సోదరులంతా సమానులుగా, రామదండుగా ఉంటూ ఏ ఒక్కరికి కష్టంకలిగినా అది అందరిదిగా భావించి తొలగించాలనీ, అదే దేశభక్తి అనీ ఉద్బోధించి రాజ్యాన్ని సురక్షితం చేశాడు.

విజయచిహ్నాలుగా హనుమంతుని ప్రోత్సాహంతో కుశుడు తనపేరిట కుశావతి అనే నగరాన్నీ, లవుడు తన పేరిట లవంతిక అనే నగరాన్నీ నిర్మించారు.

లవకుశులు సమర్థంగా రాజ్యపాలన చేస్తున్నారు. వారి బల పరాక్రమాల మీద హనుమంతుడికి మంచి నమ్మకం కుదిరింది. వారు రామరాజ్యం పేరు నిలబెట్టుతూ, రాజ్యనిర్వహణ చేస్తున్నందుకు సంతృప్తికలిగింది. తాను యింక గంధమాదన పర్వతానికి వెళతానని లవకుశులకు చెప్పాడు.

కుశలవులు పెద్ద ఉత్సవంతో హను మంతుడిని గంధమాదన పర్వతం దగ్గర దిగబెట్టారు.

హనుమంతుడు చిరకాలం రఘువంశ కీర్తి ప్రతిష్ఠలను నిలబెట్టుతూ వర్ధిల్లండని కుశలవులను ఆశీర్వదించాడు. ప్రజా సమూహాన్ని ఉద్దేశించి హనుమంతుడు, "రామదండుగా దేశమంతా కలిసి కట్టుగా పనిచేస్తే సాధించలేనిది లేదు. రామరాజ్యంలో అందరూ లవకుశులే!" అని చెప్పి వారిని అయోధ్యకు మరల మన్నాడు.

ప్రజలు హనుమంతుడికి నమస్కరించి చేతులెత్తి, "జై వీరహనుమాన్!" అంటూ జయ జయధ్వానాలు చేస్తూండగా తపస్సు చేసుకోడానికి హనుమంతుడు గంధ మాదన పర్వతం మీదకు వెళ్ళిపోయాడు.

కుశలవులు, వారి సంతతివారు రామ రాజ్యం పేరు నిలుపుతూ రఘువంశ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేస్తూ చిరకాలం రాజ్యపాలన చేశారు.

హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సు చేసుకుంటున్నాడు.

* * *

ఆ విధంగా గంధమాదన పర్వతం మీద తపస్సులో మగ్నమై ఉన్న హనుమంతు డికి ఒక్కసారి ధ్యానభంగమై కళ్ళు తెరిచాడు. పర్వతాలు కురచగా కనిపిం చాయి. మహావృక్షాలు మొక్కల్లాగ, ఏనుగులు ఎలుకల్లాగా తోచాయి; ఆకా శాన్ని పరికించాడు; సప్తర్షిమండలం ధ్రువనక్షత్రానికి దూరంగా జరిగి ఉంది; దాన్నిబట్టి యుగం మారిందని అను కున్నాడు.

అదే సమయంలో త్రికాలజ్ఞుడైన నారదుడు అటేవచ్చి, "ఇప్పుడు ద్వాపర యుగం మొదటి పాదం ప్రారంభంలో ఉన్నది, హనుమా! ఈ ద్వాపరయుగం నాలుగోపాదంలో నీకు రామసందర్శనం కలుగుతుంది!" అని చెప్పి వెళ్ళాడు.

హనుమంతుడు తిరిగి తపస్సు అందు కున్నాడు.



# దక్షయజ్ఞం



పూర్వం ప్రజాపతులలో ఒకడైన దక్షుడు ఆదిశక్తిని ఆరాధించి, ఆమెను తన కుమార్తెగా జన్మించమని ప్రార్థించాడు. ఆదిశక్తి సమ్మతించి, అతని యాభై మంది కుమార్తెలలో ఒకతెగా పుట్టింది.

ఆమె పేరు సతి. సతి మహాశక్తి అవతారమన్న సంగతి దక్షుడు గ్రహించలేదు. ఆమె ఎల్లప్పుడూ తపస్సు చేసుకుంటూ ఉండేది.





ఆమె యుక్తవయసు రాగానే తాను శివుణ్ణి తప్ప మరెవరినీ పెళ్ళాడనన్నది. దక్షుడు దీనికి అభ్యంతరం చెప్పాడు. అయితే దేవతలు జోక్యం కలిగించుకుని, శివుడికీ, సతికీ పెళ్ళిచేశారు. సతి శివుడి వెంట కైలాసానికి వెళ్ళిపోయింది.



తరవాత కొంతకాలానికి దక్షుడు పెద్ద యజ్ఞం తలపెట్టి, దానికి తన కూతుళ్ళనూ, అల్లుళ్ళనూ అందరినీ ఆహ్వానించాడు గాని, శివుణ్ణీ, సతినీ ఆహ్వానించలేదు.

కైలాసంలో ఉన్న సతికి తండ్రి చేసే యజ్ఞం గురించి తెలిసి, ఆమె వెళ్లాలను కున్నది. "నిన్ను ఎవరు పిలిచారు?" అని శివుడు అడిగాడు. "తండ్రి ఇంటికి పోవటానికి ఆహ్వానం దేనికి?" అన్నది సతి.





శివుడు సరేనన్న మీదట సతి దక్షుడి ఇంటికి వచ్చింది. ఆమె తాపసి వేషం చూసి దక్షుడు మండిపడి, శివుణ్ణి నానామాటలూ అన్నాడు. సతి తండ్రి నోరు కట్టలేకపోయింది.



తండ్రి తన భర్తను నానామాటలూ అంటుంటే వినలేక సతి ప్రాణాలు విడిచింది. సతి వెంట వచ్చిన ప్రమధులు వెళ్ళి శివుడికి ఈ వార్త చెప్పారు. శివుడు లేచి నిలబడి, తన జటను పెరికి, ఆగ్రహావేశంతో నేలకేసి కొట్టాడు.



వెంటనే అసంఖ్యాకమైన ప్రేత పిశాచాలు పుట్టుకొచ్చి, దక్షుడి యజ్ఞ వాటికకు వెళ్ళి, యజ్ఞాన్ని ధ్వంసం చేశాయి. యజ్ఞస్థలం శ్మశానంగా మారింది.



త్వరలోనే అక్కడికి శివుడు వచ్చి, సతి కళేబరాన్ని చేతులతో ఎత్తుకుని, ప్రళయతాండవం చేశాడు. లోకాలు కంపించాయి.



అది చూసి దేవతలు భయపడి, శివుడి ప్రళయతాండవం ఆపమని విష్ణువును ప్రార్థించారు. విష్ణువు సుదర్శన చక్రాన్ని ప్రయోగించాడు.



విష్ణుచక్రం సతి కళేబరాన్ని ముక్కలు ముక్కలుగా నరికింది. ఆ ముక్కలు భరతఖండమంతటా 51 స్థలాలలో పడ్డాయి. శివుడు క్రమంగా శాంతించాడు.



సతి శరీరఖండాలు పడిన స్థలాలన్నీ పుణ్యక్షేత్రాలు అయాయి. ఆదిశక్తి శరీరంతో ఆ ప్రదేశాలు పవిత్రమయాయని హిందువులు వాటిని పూజిస్తారు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

తెల్లవార వస్తున్నది. ఇంకా జనసంచారం సాగలేదు. ఒక అవధూత సమాధిలో ఉండి, దారికి అడ్డంగా పడి ఉన్నాడు.

ఇంతలో ఒక దొంగ అటుగా వచ్చి, అవధూతను చూసి దొంగ అనుకుని, "ఒరే, పిచ్చి వెధవా! తెల్లవార్లూ దొంగతనం చేస్తే ఇట్లాగే ఒళ్ళు తెలీకుండా నిద్రపోతావు. ఎవరన్నా చూసే లోపల ఇంటికి పో!" అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

తరవాత ఒక తాగుబోతు అటుగా వచ్చి, "ఒరే, తాగితే తాగావు! ఇంటికి పోలేకుండా, దారిలో పడిపోయేటంత తాగుతార్రా?" అని కోప్పడి, వెళ్ళిపోయాడు.

ఆ తరవాత మరొక అవధూత అటుగా వచ్చి, సమాధిలో ఉన్నవాడు కూడా అవధూతేనని గుర్తించి, అతడి చెవిలో ప్రణవమంత్రం జపించి, అతనికి కాళ్ళు పట్టసాగాడు. —నాయర్.

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలింపబడవు.

కార్డులు మాకు జూన్ 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, ఆగస్టు నెల చందమామలో ప్రకటించబడును.

---

ఏప్రిల్ నెల పోటీ ఫలితం:-కుట్టుట, కిట్టుట కొరకే!

గెలుపొందిన వారి పేరు: శ్రీమతి పి. బి. లక్ష్మి, రంగనాథన్‌గారి హౌస్,

విజయనగరం.

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 ఆగస్టు నెల సంచికలో ప్రకటింపబడును.







P. Sundaram

Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కోడెదూడకు,

రెండవ ఫోటో : కాడి తప్పదు.

పంపినవారు : పి. శ్రీకాంత్, పత్తికొండ. (చిత్తూరు జిల్లా.)

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# జెమ్స్‌తో బలే మజా

## అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

ఇక్కడ లేని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం ?







మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి. మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.

"Fun with Gems"
Dept. B-14
Post Box No. 56,
Thane 400 601
Maharashtra.

ఎంట్రీలు గ్రహింపబడేందుకు ఆఖరు తేది:
30.6.1978

## త్వరపడండి!

మీ జవాబుతోపాటు క్యాడ్‌బరిస్ జెమ్స్‌యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి.

**చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరిస్ జెమ్స్**

CHAITRA-C-161 TEL

‘అరే! బలే బాగుంది’







Creative Unit 3493 Tel.

గోల్డ్ స్పాట్–
దీని రుచి పెదవిపై చిరునవ్వుగా మారుతుంది.






















నోరూరించే
మనసుదోచే
మైమరపించే




# పార్లే పాపిన్స్

పండ్లరుచిగల పిప్పరమెంట్లు



5 పండ్ల సువాసనలలో— రాస్ప్‌బెరి, అనాస, నిమ్మ నారింజ, మోసంబి.

everest/871/PP-tl